12th March 2011

Saturday

(750) మృత్యుదారుకుఠారికా.

మృత్యువు అనే పెద్దచెక్కలకి కి గొడ్డలివంటిది అమ్మ అని అర్థం.

మృత్యు, దారు, కుఠారికా.

మృత్యువు రెండు రకాలు : ① యదార్థ మృత్యువు / జన్మ మృత్యువు.
② అపమృత్యువు.

→ యదార్థమృత్యువు – ప్రతి మనిషి పుట్టిన తరువాత గిట్టి తీరాలి. మనం పుట్టిన వ్యాళ తరువాత మనం పుట్టిన ఆ సమయాన్ని బట్టి మన ఆయుష్షు తెలుస్తుంది. అది జన్మ మృత్యువు.

→ అపమృత్యువు – ఇది మృత్యువుతో సమానమైనది, మృత్యువు కన్నా ఎక్కువ బాధను కలిగిస్తుంది. అది ప్రమాద రూపంలో ఏ రూపంలో అయినా ఉండవచ్చు. ఉదా: వాహన ప్రమాదంలో ఏదైనా జరిగితే ఆ తరువాత కదలలేని స్థితి వస్తే అప్పుడు కలిగే బాధ సామాన్యమైనది కాదు. ఇది ఉపమృత్యువు అని అర్థం.

→ మన పురాణాల్లో పరీక్షిత్ అనే పేరు కలిగిన మనిషి కనిపిస్తారు. అతడి అసలు పేరు విష్ణురాత. విష్ణురాత అనే పేరు రావడానికి కారణం ఏంటి అంటే, అతడు అతని తల్లి గర్భంలో ఉండగా [illegible] తరగడం మానేసాడు. వెంటనే కుంతీదేవి శ్రీకృష్ణుడిని ప్రార్థించింది. అప్పుడు శ్రీకృష్ణుడు విష్ణుస్వరూపంలో ఆ గర్భంలోకి వెళ్ళి అతడిని కాపాడాడు. అతడు విష్ణువు చేత రక్షింపబడ్డాడు కాబట్టి అతడి పేరు విష్ణురాత అని పెట్టారు. అతడే పరీక్షిత్ అయ్యాడు.

→ సతీ సావిత్రీదేవి అమ్మవారి అనుగ్రహంతో పుట్టింది. అందుకే ఆమెకి యమధర్మరాజు కనిపించాడు.

→ అమ్మని ఈ నామంతో పూజిస్తే మృత్యువు దరికి రాదు.
ఒకవేళ మనకి నిజంగానే మృత్యువు రాసిపెట్టి ఉంటే
మనకి ప్రార్థన చేసి పూజించే సమయమే దొరకదు.

Important : మృత్యు బాధ నుంచి ; లేదా ; రోగాల బారి నుంచి
విముక్తి పొందాలంటే అమ్మని ఈ నామంతో ప్రార్థించాలి.

మనం ఏదైనా చెక్కని గొడ్డలితో నరకాలి
అంటే ముందు గొడ్డలికి పదును పెడతాం. ఇక్కడ పదును
పెట్టడం అంటే అమ్మవారిని నామాలతో స్తుతించడం అని అర్థం.
అలా అమ్మని స్తుతించి అమ్మ అనుగ్రహం పొందాక అమ్మ
మనల్ని కాపాడుతూ ఉంటుంది. కాబట్టి మృత్యువు అనే
పెద్ద చెక్కకి గొడ్డలి వంటిది అమ్మ అంటే మృత్యువు
నుంచి మనల్ని ఎప్పుడూ కాపాడేది అమ్మ అని అర్థం వచ్చే
నామం ఇది. ఏ ఇల్లాలి పసుపు కుంకుమలూ కూడా
పోతే అమ్మ సహించదు. సావిత్రీదేవి అమ్మని ప్రార్థించే
తొలుత తన పతి ప్రాణాలను మళ్ళీ తెచ్చుకుంది. కాబట్టి
ముత్తైదువైన ప్రతి స్త్రీ తన పతి గురించి అమ్మను ఈ
నామంతో ప్రార్థించాలి.

[illegible]

[illegible] March 2011 — Monday.

(250) మహా ఈశ్వరి. → మహేశ్వరి.

అమ్మ, మనకి నీరు, నిప్పు అన్నీ ఇచ్చింది. అలాగే నీరుని ఆపి వేయగలదు, అలాగే నిప్పుని ఆర్పి వేయగలదు. అన్నీ తెలిసినది అమ్మ.

మనల్ని కాపాడేది స్థితికర్త అయిన శ్రీమహా విష్ణువు. ఆ శ్రీమహా విష్ణువును కూడా కాపాడగలిగేది అమ్మ. అందుకే అమ్మకు మహా ఈశ్వరి అంటే మహేశ్వరి అనే నామం వచ్చింది.

[illegible] March 2011 — Tuesday.

(251) మహాకాళి

మహా అంటే అనేకవాటి కన్నా ఎక్కువైనది.

మాఘ మాసంలో వచ్చే బహుళ చతుర్దశి రోజున వచ్చే శివరాత్రి మాత్రమే మహా శివరాత్రి.

భాద్రపద శుద్ధ చవితి మాత్రమే వినాయక చవితి.

→ మహాకాలుడి యొక్క భార్య మహాకాళి.

→ మహా కాలం అనే స్వరూపంగా కలిగినది మహాకాళి.

ఏ కాలంలో ఏది జరగబోతోందో, ఏది జరిగిందో, ఏది జరుగుతోందో అవన్నీ తెలిసినది మహాకాళి.

అమ్మకి కుడివైపు చెవికి సూర్యుడు ఆభరణంగా ఉంటాడు, ఎడమ వైపు చెవికి చంద్రుడు ఆభరణంగా ఉంటాడు. పగలు సూర్యుడు ఉండగా ఏం జరిగాయో దోషాలు గాని

లేక మిగిలి పనులు గాని ఏం జరిగాయో అవి అమ్మ
సూర్యుడు అమ్మకి చెప్తారు. రాత్రి ఏవైతే జరిగాయో
అవన్నీ చంద్రుడు అమ్మకి చెప్తేస్తారు. కాబట్టి ఆవిడ
కాలస్వరూపం. ఆవిడ కాబట్టి ఆవిడకి తెలియని ఏవీ
ఉండదు.

అమ్మ ప్రత్యేకంగా పరిపాలించే కాలం సంధ్యా సాయంకాలం,
మరియు ప్రాతః సంధ్యా కాలం. అంటే సూర్యుడు
అస్తమించి మరియు చంద్రుడు ఉదయించే వేళ లేక
చంద్రుడు అస్తమించి సూర్యుడు ఉదయించే వేళ
అమ్మ స్వయంగా అగ్నివర్ణంలో అంటే అగ్ని రూపంలో
లాగే పరిపాలిస్తుంది.

కాలరూపమైన అమ్మ ఎవరికి ఎప్పుడు ఆయువు
తీరుతుందో అప్పుడు వధిస్తుంది. తన ఉద్యోగ
బాధ్యతను ఖచ్చితంగా పాటించి చేసే అమ్మ
ఏ ప్రాణి అయినా కొట్టుమిట్టాడుతూ ఉంటే
ఎంత మర్చి ఉపద్రవంలో, ఆవిడ ఖచ్చితంగా
కనికరం కూడా చూపుతుంది అని ఈ నామం అర్థం.

16th March 2011

Wednesday

(752) మహాగ్రాసా.

గ్రాసా అంటే గడ్డి అని అర్థం. ; అయితే పైకి ఏ అర్థం కనిపిస్తుందో ఆ అర్థం మాత్రం తీసుకోకూడదు.

పై నామం అర్థం కనిపించే విధంగా చూస్తే "పెద్ద గడ్డి మోపు ఆహారంగా కలిగినది" అని అనిపిస్తుంది. కానీ, ప్రాచీనులు బాగా ఆలోచించి నామాలు రాసేవారు. పై నామం బాగా పరిశీలించి చూస్తే "ఆహారం బాగా ఎక్కువగా తినేది" అని అర్థం.

సహజంగా గర్భవతులు వైద్యుని దగ్గరికి వెళ్తే మనల్ని ఎలా ఎక్కువ తీసుకోమని చెప్తాడో అలాగే లలితాదేవి మనల్ని తన గర్భంలో పెట్టుకుని, మనకి సరిపడా ఆహారం అందించడానికి అమ్మ కూడా అలాగే ఆహారాన్ని స్వీకరించాలి. మనం సహజంగా చిన్న బిడ్డ కోసం అంత ఆహారం ఎక్కువ తీసుకుంటే, మరి జీవరాసిని అంతటినీ తన గర్భంలో ధరించిన అమ్మ ఎంత ఎక్కువ ఆహారం తీసుకోవాలో మనం ఒక్కసారి ఆలోచించాలి.

మహా అంటే బలవర్ధకమైన ఆహారాన్ని తీసుకునేది అని అర్థం అవి ఏంటంటే పెసరపప్పు, హరిద్రా అన్నం మొదలగునవి. అలా ఆవిడకి ఇష్టం అని చెప్తూ, మనకి కూడా మంచిది అని చెప్తుంది.

మహాగ్రాసా అంటే రాక్షసులని ఆహారంగా స్వీకరించేది అని అర్థం. ఆహారంగా స్వీకరించడం అంటే తినడు, కానీ, మనల్ని తినడానికి వచ్చే రాక్షసులను ఆవిడ వధిస్తుంది అని అర్థం.

17th March 2011 Thursday

(752) మహాశనా.

మహా, అశనా.

అశనా అంటే ఆహారం.

ఎంతో అన్నాన్ని తన వద్ద కలిగి ఉన్నది అని ఒక అర్థం.

ఎంతో అన్నాన్ని తినేది అని అర్థం - ఇంకో అర్థం.

ఎంతో ఎక్కువ ఆహారాన్ని స్వీకరించేది అని అన్నమాట.

ఏది దొరికినా సరే కడుపులో దాచుకునే స్వభావం అమ్మది.

ఒక ప్రాణిని ఇంకో ప్రాణి హింసించడం అమ్మకు అస్సలు ఇష్టం ఉండదు.

ఏదైనా తన కడుపులో పెట్టుకునే స్వభావం అమ్మది. ఇది కూడా దృష్టిలో ఉంచుకుని, ఏదైనా సరే తనలో ఉంచుకుంటుంది అమ్మ, అది ఆహారమైనా, కష్టమైనా, మాట అయినా అని చెప్పే నామం ఇది.

18th March 2011 Friday

(753) మహాశనా.

గొప్పదైన ఆహారం కలిగినది.

Same repetition as ~~on~~ of ~~Yesd~~ yesterdays.

19th March 2011 Saturday

(754) అపర్ణా.

చెట్ల యొక్క ఆకులను కూడా ఆహారంగా తీసుకోకుండా తపస్సు చేసింది అమ్మ.

అమ్మవారు సతీదేవి అవతారం తరువాత హైమావతి అవతారంలో శివుడిని పెళ్లిచేసుకోవాలని తపస్సు చేయ సాగింది. సూర్యుడిలోని కిరణ శక్తిని, చంద్ర కిరణాలలోని శక్తిని అమ్మ స్వీకరించి, వాటిని ఆహారంగా సేవించేది.

21st March 2011

Monday.

(755) చండికా.

ఆగ్రహస్వభావం కలిగినది.
చెప్పలేనంత కోప రూపంగా కనిపించేది అని అర్థం.
తన సంతానం మీద కోపం తెచ్చుకోదు అమ్మ, ఆ సంతానానికి
కష్టం కలిగించే వారి మీద కోపం వస్తుంది అమ్మకి.
→ అమ్మ శరీరంలోంచి కోపం పెంకిగా బయటికి వస్తే,
ఆ కోపానికి ఒక రూపం వస్తే, ఆ రూపమే చండికా.
మధుకైటభులు అని ఇద్దరు రాక్షసులు ఉండేవారు. వాళ్ళు
వరాలు పొంది శ్రీమహావిష్ణువు శయనించి యోగనిద్ర లోకి
వెళ్ళే వరకు ఉండి ఆయన ఆ యోగనిద్రలోకి వెళ్ళగానే
బ్రహ్మగారి దగ్గరకి వెళ్ళి ఆయనని ఆ సింహాసనం లోంచి
దిగమన్నారు. ఇంక మేము సృష్టి చేస్తాము, నువ్వు వెళ్ళు
ఇక్కడ నుంచి అన్నారు. ఆయన విష్ణువు దగ్గరకు
వెళ్ళారు. అప్పుడు ఆయన యోగనిద్రలో ఉన్నారు.
అప్పుడు ఆయన శివుడి దగ్గరకు వెళ్ళారు. ఇద్దరూ
కలిసి అమ్మ దగ్గరకు వెళ్ళారు. అమ్మ "సరే! నేను
చూసుకుంటాను" అని అంది. ఈ లోపల వీళ్ళు మళ్ళీ
విష్ణువు దగ్గరకు వెళ్ళారు. ఆయన వింటినారిలో బాణం సంధించి
పక్కన పెట్టుకుని కూర్చు పడుకున్నారు. అప్పుడు శంకరుడు చతుర్ముఖ
బ్రహ్మగారితో "నువ్వు ఒక చెద (సొరుగు) పురుగుని సృష్టించు,
అది వెళ్ళి ఆ వింటినారిని కొరుకుతుంది. అప్పుడు బాగా పెద్ద
శబ్దం వస్తుంది. అప్పుడు విష్ణువు లేస్తారు. అప్పుడు మనం
"స్వామి! మధుకైటభులు వచ్చారు" అని చెప్దాం. అప్పుడు ఆయన
సంహరిస్తారు వీళ్ళని అని అనుకున్నారు. అలానే చేసారు.

అయితే ఆ చెద వింటినారి కొరకగానే ఆ బాణం
విష్ణువు తలలోకి దూసుకుని వెళ్ళి ఆ తలని రెండుగా
చీల్చింది, ఆ దెబ్బకి ఆ తల రెండుగా చీలి ఎగిరిపోయింది.
యోగనిద్రలో ఉన్న విష్ణువును హత్య చేసాము అని
వెంటనే మళ్ళీ శంకరుడు, చతుర్ముఖ బ్రహ్మగారు
కలిసి అమ్మ దగ్గరకు పరిగెత్తుకుని వెళ్ళారు. అమ్మ ఆ
విషయం విని ఒక చిరునవ్వు నవ్వి, హయగ్రీవుడు అనే
రాక్షసుడు ఉన్నాడు. అతడు నన్ను గుర్రం తల ఉన్నవాడే
చంపాలి అని వరం పొందాడు. అందుకని విష్ణువు తల అలాగ
అయ్యింది. విశ్వకర్మ ఒక గుర్రం తల తీసుకుని వచ్చి
విష్ణువుకి పెట్టండి, విష్ణువు ఆ రాక్షసుడిని సంహరిస్తాడు
అని అన్నది. అలాగే చేసారు, విష్ణువు ఆ రాక్షసుడిని
సంహరించాడు. తరువాత అమ్మ చండికా రూపంలో
విష్ణువును మధుకైటభులని చంపమని ప్రేరేపించింది,
విష్ణువు వాళ్ళని వధించాడు. మధుకైటభులని అమ్మ
తానే స్వయంగా చంపలేదు, విష్ణువు ద్వారా చంపించింది,
అది కూడా చండికా రూపంలో. ఇవన్నీ గుర్తు చేసే
నామం ఇది. కాబట్టి అమ్మని శక్తి రూపంలో
ఆరాధించాలి అంటే ఈ నామంతో ప్రార్థించాలి.

22nd March. 2011

Tuesday.

(756) చండముండాసుర నిషూదినీ.

చండ, ముండ, అసుర, నిషూదినీ.

చండుడు, ముండుడు అని ఇద్దరు రాక్షసులు ఉండేవారు వాళ్ళ ఇద్దరినీ అమ్మవారు వధించింది.

సహజంగా ఎవరైనా ఇంటికి వస్తే వాళ్ళని మర్యాద చేస్తే ఉంటారు, అమర్యాద చేస్తే వెళ్ళిపోతారు. అయితే చండుడు అంటే రక్తపోటు, ముండుడు అంటే మధుమేహం. వీళ్ళిద్దరూ ఈ కాలంలో రాజ్యం ఏలుతారు. వీళ్ళు మన శరీరంలో ఉన్నప్పుడు వాళ్ళకి అమర్యాద చేస్తే, అంటే వాళ్ళకి నచ్చనివి తింటే, అమాంతంగా రక్తపోటు, మధుమేహం పెరిగిపోతాయి. వాళ్ళకి అమర్యాద చేస్తే వాళ్ళు అస్సలు సహించరు, పైగా వాళ్ళ ప్రాణాలు తీయడానికి కూడా వెనకాడరు. వాళ్ళ దగ్గర నుంచి ఉపశమనం పొందాలంటే అమ్మని ఈ నామంతో ప్రార్థించాలి.

23rd March 2011 Wednesday

(757) క్షరాక్షరాత్మికా.

క్షర, అక్షర, ఆత్మికా.

అంటే నశించేది (క్షర), నశించనిది (అక్షర) - రెండూ తన రూపముగా కలిగినది (ఆత్మికా) అని అర్థం.

ఒకసారి ముగ్గురు రాక్షసులు చతుర్ముఖ బ్రహ్మగారి దగ్గరకి వెళ్ళి మృత్యువు రాకుండా వరం ఇవ్వమన్నారు. అయితే బ్రహ్మగారు మీ ముగ్గురూ కలవకుండా ఉంటే మీ దగ్గరకి మృత్యువు రాదు అని చెప్పారు. వాళ్ళు అలాగే మూడు స్థాపితం కాకుండా ఎగర గలిగే మూడు నగరాలు ఇవ్వమని కోరారు. అలాగే బ్రహ్మ వాళ్ళకి వెండి, రాగి, ఇనుము తో చేసిన మూడు నగరాలు ఇచ్చారు. వెండి - తెల్లగా ఉంటుంది కాబట్టి అది సత్వ గుణానికి ప్రతీక, రాగి - కొంచెం ఎరుపు రంగులో ఉంటుంది కాబట్టి అది రజోగుణానికి ప్రతీక, ఇనుము - నల్ల రంగులో ఉంటుంది కాబట్టి అది తమోగుణానికి ప్రతీక. ఎప్పుడైతే సత్వ గుణానికి గుణం ఎక్కువగా ఉంటుంది, అప్పుడు పరమాత్మ మనల్ని వధించరు. కాబట్టి అలా సత్వ, రజో, తమో గుణాల నగరాల్ని ఇచ్చారు బ్రహ్మ. ఎప్పుడైతే ఈ మూడు గుణాలు కలుస్తాయో అప్పుడు రజో, తమో గుణాలు విజృంభించి సత్వ గుణాన్ని తగ్గించేస్తాయి. అలా పూర్తిగా సత్వ గుణం తగ్గిపోయాక రజో, తమో గుణాలు విజృంభించి మృత్యువు దరికి చేరుస్తాయి. కాబట్టి బ్రహ్మ వాళ్ళ ముగ్గురుని కలవద్దని చెప్పారు. కాని, వాళ్ళు రాక్షసులు కాబట్టి, "మనం కలవకూడదని బ్రహ్మ చెప్పాడు, బ్రహ్మ దైవం కదా! మనం రాక్షసులం కదా! మనం బ్రహ్మ

చెప్పినట్టు ఎందుకు వినాలి. మనల్ని కలవకూడదని బ్రహ్మ
చెప్పారు కాబట్టి, బ్రహ్మ చెప్పినందుకైనా సరే మనం
కలుద్దాం" అని అనుకుని కలిసారు. అలా ఆ కలిసేటప్పటికి
సర్వాంగం పూర్తిగా పోయి, రజస్తమో గుణాలు పెరిగిపోయి
మృత్యువు దరికి వాళ్ళని చేర్చాయి, విష్ణుమూర్తి వాళ్ళని
సంహరించారు.

24th March 2011 — Thursday.

(758) → 712 name - స్వాదుసాధ్వి - సాధు, ఈ రెండు పేర్లు కాబట్టి 758th
(759) సర్వలోకేశీ. name అంతలో కలిసిపోయింది
సర్వ లోకాలకు ప్రభు ఈశ్వరి.
దృశ్యలోకం, అదృశ్య లోకం - ఈ రెండూ మనకి తెలుసు.
లోకల్లో కూడా కొన్ని లోకాలున్నాయి, కాని, అవి మనకి
కనిపించవు, అవి మనకి అదృశ్య లోకాలు.
పగలుకి, రాత్రికి, సూర్యోదయ సమయానికి అంటే
ఉదయ సంధ్యకి, సాయం సంధ్యకి అంటే సూర్యాస్తమయ
సమయానికి అన్నింటికీ అమ్మే నాయకురాలు. అన్ని
లోకాలు అంటే మనకి తెలిసిన పద్నాలుగు లోకాలు
అంటే సప్తలోకాలు నుంచి స్వర్గ లోకం వరకు, భూలోకానికి,
మళ్ళీ పాతాళ లోకాల వరకు అన్ని లోకాలకి కూడా
అమ్మే ఈశ్వరి.

25th March 2011 Friday.

(760) విశ్వధారిణీ.

ఈ ప్రపంచాన్ని ధరించి ఉండేది అని అర్థం.

ధారిణీ (ధరించునది) - ధరిస్తుంది అని అర్థం

ధారయతి - ధరింప చేయిస్తుంది.

అమ్మ ప్రపంచాన్ని ధరించింది అంటే,
కృత యుగంలో అమ్మ ఆ శరీరాన్ని ధరించింది. అదే
త్రేతా యుగంలో ముందు ధరించిన శరీరాన్ని
తీసేసి మళ్ళీ త్రేతా యుగానికి సంబంధించిన శరీరాన్ని
ధరిస్తు ధరించాడి. అలాగే ద్వాపర యుగంలో మళ్ళీ
ఒక శరీరాన్ని, మళ్ళీ కలి యుగంలో వేరే శరీరాన్ని
ధరించింది.

Imp:- సత్ సంతానం కావాలి అనుకుంటే అమ్మని ఈ నామంలో
ప్రార్థించాలి.

కృత యుగంలో అందరూ ధర్మాత్ములు, సత్య వాక్కును
పలికేవారే ఉండేవారు. దానం ఇస్తాను తీసుకో అని
అడిగితే, వద్దు మళ్ళీ నేను ఋణగ్రస్తుడిని అవుతాను,
నీకు కొడుకుగా పుట్టి మళ్ళీ జీవితం అంతా ఇది జీవించి
మళ్ళీ సంసార చక్రంలో పడతాను, నాకు వద్దు నీ దానం
అనేవారంట. త్రేతా యుగంలో ఒక ధర్మమూర్తిని
చూపించి, అతని లాగా ప్రజలందరిని జీవించ మని
అడిగింది అమ్మ. ద్వాపర యుగంలో అనుమానం అనే
కొత్త వ్యాధి మొదలైంది. అందుకే పాండురాజు
రాజ్యాన్ని ధృతరాష్ట్రుడు పరిపాలించాడు, తరువాత
పాండవులకు, కౌరవులకు మధ్య యుద్ధం జరిగె,

కురుక్షేత్రం అయ్యి ద్వాపర యుగం ముగిసింది. కలి యుగం
లో అన్ని రకాల దుర్బలవాళ్ళు, అసత్యం, అధర్మం,
అబద్ధాలు, అన్ని రాజ్యం ఏలుతాయి. ఇలా యుగాలన్నీ
అయిపోయి మళ్ళీ యుగ చక్రం మొదలయ్యి మళ్ళీ
కృత యుగం వస్తుంది.

26th March 2011 Saturday.

(761) త్రివర్గదాత్రీ.

త్రి - మూడైన

వర్గ - విభాగాలని

దాత్రీ - ఇచ్చేది.

అమ్మ అందరికీ ధర్మ, అర్థ, కామాలను ఇస్తుంది. ఈ
మూడు పురుషార్థాలని మాత్రమే అందరికీ ఇస్తుంది.
నాలుగవ పురుషార్థం అయిన మోక్షాన్ని అందరికీ ఇవ్వదు,
ఎవరికి ఇవ్వాలో వాళ్ళకే ఇస్తుంది.

Imp:- ధర్మబద్ధమైన సత్ సంతానం కలగాలంటే అమ్మని
గర్భవతులు ఈ నామంతో ప్రార్థించాలి. అమ్మని ఒకవేళ
మనకున్న కోరికలు తీర్చమని ప్రార్థించాలంటే, పురుషార్థాలలో
ధర్మం, అర్థం, కామం కి సంబంధించిన కోరికలు తీరాలంటే
అమ్మని ఈ నామంతో ప్రార్థించాలి. ప్రతిఫలం ఆశించకుండా
మన కోరికలు తీరుస్తుంది అమ్మ. ఒకవేళ మోక్షం కావాలని
మన ప్రార్థించలేం, అది మన చేతుల్లో ఉండదు.

"రత్నగ్రైవేయ చింతాకలోల ముక్తా ఫలాన్వితా" అని ఒక
పేరు ఉంది అమ్మవారి పేర్లలో. మనకి జపం చేసే విధానాలు

మూడు గా విభజించారు పెద్దలు. వాటిల్లో ఒకటి
గ్రైవేయం, రెండోది చింతాకం. గ్రైవేయం అంటే
గొంతులో జపం చేస్తూ ఉంటుంది కాని పెదాలు
కదలవు, చేతిలో జపమాల ఉంటుంది. ఇది గ్రైవేయ
పద్ధతి. చింతాకం అంటే మనం బుద్ధిలో దేవుడిని
స్మరిస్తూ జపం చేస్తూ ఉంటాం పెదాలు కదులుతాయి.
ఇది చింతాక పద్ధతి. మనం సహజంగా రామదాసు
పాటల్లో "సీతమ్మకు చేయిస్తి చింతాక పతకము"
అని వింటూంటాం. అది చింతాకు కాదు, చింతాక.
చాలా మంది పొరపాటుగా చింతాకు అని అంటూ
ఉంటారు. కాబట్టి ఈ రెండు పద్ధతుల్లో మనం
అమ్మ నామాల్ని జపిస్తూ ఉంటే మనకి మన
జపాన్ని బట్టి ముక్తిని కూడా ఫలితంగా ఇస్తుంది
అమ్మ అని ఈ నామం అర్థం.

27th March 2011 → Sunday → Holiday.

28th March 2011 Monday.

(762) సుభగా = సౌభాగ్యమును ఇచ్చునది అని అర్థం.
తెలుగు సాంప్రదాయంలో ఆశీర్వాదానికి ఒక ప్రత్యేకత
ఉంటుంది.
చిన్న పిల్లలను ఆశీర్వదించాలి అంటే దీర్ఘాయుష్మాన్భవ అని
దీవిస్తారు. అలాగే విద్యని అభ్యసించేవారిని దీవించాల్సి
వస్తే విద్యాప్రాప్తిరస్తు అని దీవించాలి. అలాగే వివాహ
వయస్సు వారిని ఆశీర్వదించాలి అంటే [illegible] వివాహ

సిద్ధి రస్తు అని అంటారు. అలాగే పెళ్లి అయ్యిన వాళ్ళని
సౌభాగ్యవతీ భవ అంటారు.
సౌభాగ్యవతి అంటే ఆ సంపద కలగడం కాదు. భర్తను
మెప్పించ గలిగే గుణం అని అర్థం. భర్త తనకు తానే
నా భార్య చాలా అనుకూలవతి అని అనుకోవడం.
ఆభరణం అంటే బాహ్య శరీరానికి పెట్టుకునేవి కావు.
ఏ భర్త మాట అయితే భార్యదో, ఏ భార్య మాట
అయితే భర్తదో, ఇద్దరూ ఒకే మాట మీద నిలబడితే
అది భార్యకు అసలైన ఆభరణం.
"నా భర్త, నా మాటను విని, నా వాక్కు ద్వారా
కల్పించుకో" అని అమ్మ చెప్తా, దానికి నా సహకారం
కావాలంటే "నన్ను ఈ నామంతో జపించు" అని చెప్పే
నామం ఇది. అంటే చక్కని పద్ధతిలో మాట్లాడి,
నువ్వంటే మంచి అభిప్రాయం వచ్చి, నా మాటకు
విలువ ఇచ్చే స్థితి కల్పించడం నా మాటల్లోనే,
నువ్వు వాక్కును పలికే పద్ధతిలో ఉంటుంది అని అర్థం.
నెయ్యిని మనమే ఆవుపాల ద్వారా చేసుకోవచ్చు. చక్కని
ఆవుపాల నుంచి నెయ్యిని తయారు చేసుకుని, అది
వాడితే, ఆవునెయ్యి వల్ల గొంతు చాలా చక్కగా అవుతుంది.
అమ్మవారు సౌభాగ్య అష్టకాన్ని ఇష్టపడేది. చెఱుకు, కుంకుమ,
కుంకుమ పువ్వు, ఇలా ఎనిమిది సౌభాగ్య చిహ్నాలు
ఉన్నాయి. అవి ఉన్న ఇంట్లో అమ్మ ఆనందంగా ఉంటుంది.
కాబట్టి సౌభాగ్య అష్టకాన్ని ఇష్టపడే అమ్మవారిని, సౌభాగ్యం
ఇవ్వమని ఈ నామంతో ప్రార్థిస్తాం.

29th. March. 2011 Tuesday.

(763) త్రియంబకా.

త్రి - మూడైన ; అంబకా - కళ్లను కలిగినది.
కుడివైపు ఉన్న కన్ను సూర్యుడు ; ఎడమ వైపు ఉన్న కన్ను చంద్రుడు ; మధ్యలో ఉన్న కన్ను అగ్ని.
మూడు లక్షణాలు కలిగిన మూడు కన్నులు కలిగినది అమ్మ అని విశేషార్థం.
సహజంగా సూర్యుడికి శక్తి అగ్ని ఇస్తుంది. సూర్యుడు అంటేనే నిప్పు ముద్ద. సూర్యుడికి ఆ ప్రకాశం అంతా నిప్పు వల్లే కాబట్టి సూర్యుడికి శక్తి అగ్ని ఇస్తుంది. చంద్రుడి మీద సూర్యుడి కాంతి పడితే అప్పుడు చంద్రుడు ప్రకాశిస్తాడు. కాబట్టి సూర్యుడికి శక్తి అగ్ని ఇస్తుంది, చంద్రుడికి శక్తి సూర్యుడు ఇస్తాడు.
ఎప్పుడైన కలలో అమ్మ కనిపిస్తే అప్పుడు మనల్ని అనుగ్రహించి అమ్మ వచ్చినట్లు. ~~ఆ~~ అలా వచ్చి అమ్మ లలితా సహస్ర నామాలు చదవమని చెప్తే, అర్థం, త్వరలో చిన్న ఆపద వస్తుంది అందుకని నా నామాలు పారాయణ చెయ్యి, ఆ ఆపదను చాలా సునాయాసంగా దాటుతావు అని చెప్పింది అని అర్థం.
కన్నులలో → అంటే అక్షులలో - మూడు లక్షణాలను కలిగినది అమ్మ మరియు కాలాలలో కూడా భూతకాలం, భవిష్యత్ కాలం, వర్తమాన కాలం అని మూడు కాలాలను సృష్టించినది అమ్మ, పైగా ఒకటే లక్షణాలు కలిగిన వారిని ఒక కాలంలో పుట్టించదు అమ్మ. ఉదాహరణకు ధర్మరాజుని,

దుర్యోధనుడిని, ధృతరాష్ట్రుడిని పుట్టించిన అమ్మ, వాళ్ళకి వేర్వేరు లక్షణాలను ఇచ్చింది కానీ ఒకే లక్షణాలను ఇవ్వలేదు. కాబట్టి ఆపదలనుంచి గట్టెక్కాలంటే అమ్మ నామాలను పారాయణ చేయాలని చెప్తూ, మంచి లక్షణాలు ప్రసాదించమని అమ్మ ఈ నామంలో ప్రార్థించాలి.

30th March. 2011. Wednesday.

(764) త్రిగుణాత్మికా.

త్రిగుణ, ఆత్మికా – మూడు అయిన గుణాలు తానే అయినది లలితా పరమేశ్వరి.

మూడు గుణాలు – సత్వ, రజో, తమో గుణాలు.

ప్రాచీనులు ప్రతి విషయానికి ఒక రూపాన్ని సూచించేవారు. అలాగే సత్వ రూపానికి నిదర్శనంగా లక్ష్మి దేవిని సూచించారు, రజో గుణ రూపానికి నిదర్శనంగా సరస్వతి దేవిని సూచించారు మరియు తమో గుణం నిండిన రూపంగా పార్వతి దేవిని సూచించారు. వీళ్ళు ఇలా ఎలా సూచించారు అంటే వాళ్ళ భర్తల వల్ల. విష్ణువు సత్వ గుణ మూర్తి, బ్రహ్మ రజో గుణ మూర్తి, శివుడు తమో గుణ మూర్తి. సరస్వతి దేవి అటు సత్వ గుణంలోకి వస్తుంది ఇటు రజో గుణం మూలంలోకి వస్తుంది. మామూలుగా సరస్వతి దేవి సత్వ గుణంలో ఉంటుంది కానీ తెలివి ఉన్న మనిషికి ఒకవేళ అహంకారం ఉంటే అప్పుడు ఆ వ్యక్తిని తమో గుణ మూర్తి అయిన సరస్వతి దేవి ఆశ్రయించినట్లు. అలాగే

29th March
(763

లక్ష్మీదేవి కూడా సత్త్వగుణంలోనూ ఉంటుంది
ఇటు రజోగుణంలోనూ ఉంటుంది. కాని పార్వతి
మాత్రం (నెలం) రంగులో తమోగుణం లో ఉంటుం
(గుణాల)
ఒకే ఆత్మ, కాని మూడు గుణాలను తన యందు
చూపించగలిగినది లలితా పరమేశ్వరి దేవి.
కాబట్టి మనకి సత్త్వగుణ జ్ఞానాన్ని ప్రసాదించమని అ
అమ్మని తనయందు అన్ని గుణాలనూ చూపించగ
అని చెప్పే నామం ఇది.

31st March-2011 Thursday.

(765) స్వర్గాపవర్గదా.
స్వర్గ, అపవర్గ, దా.
↳ స్వర్గ సౌఖ్యాన్ని, → మోక్ష సుఖాన్ని, దా - ఇచ్చేది.
దుఃఖం లేనిది ఏదో అది స్వర్గం; అన్ని సుఖాలే. (మానసిక
పుణ్య ఫలం అనుభవించాక తగ్గిపోతుంది అప్పుడు మళ్ళీ
కర్మలను బట్టి పాపం చేస్తే దుఃఖం అనుభవించాల్సి
వస్తుంది.
మనం మన పుణ్యాన్ని ఉపయోగించి సుఖాలు అనుభవి
అది మన తపశ్శక్తిని ఉపయోగించి మనకి సుఖాలు ఇ
ఆ తపశ్శక్తి ని మళ్ళీ మొత్తం సున్నా చేస్తుంది.
అమ్మ మనకి పుణ్యాన్ని అందచేస్తుంది, మనకి ఏ
ఫలితం మీద ఆశ లేకపోతే మన పుణ్యాన్ని పెంచి
పెంచి, మనకి మోక్షబాటను కూడా చూపిస్తుం
అమ్మ.

ఉదాహరణకు ప్రహ్లాదుడు పుట్టుకతో విష్ణు భక్తుడు, అతడిని పాము కరవడానికి వచ్చినప్పుడు లేకపోతే కొండ మీద నుంచి పడవేసినప్పుడు, ప్రహ్లాదుడు తను నారాయణ జపం వల్ల వచ్చిన పుణ్యం ఉపయోగించుకోకుండా తనని కాపాడే [illegible] భగవంతుడికే అర్పించాడు. అలా పుణ్య ఫలాన్ని వ్యర్థం చేయకుండా పరమేశ్వరుడిని ఋణ గ్రస్తుడిని చేసుకున్నారు.

మనం ఏదైనా కోరిక కోరుకుంటే దేవుడిని మన పుణ్య ఫలాన్ని బట్టి, మన జప పుణ్యాన్ని బట్టి మన కోరికలు నెరవేరుతాయి. కాబట్టి కోరికలు ~~కోరుకో~~ కోరుకోకూడదు.

మానవుడి జీవితంలో షష్టిపూర్తి అవ్వక ముందు జీవితం ఒకలాంటిది, అయ్యాక జీవితం ఒకలాంటిది. "60" వచ్చింది అంటే ఇంక మనం సాంసారిక జీవితం వదిలెయ్యాలి. దైవ చింతన లోనే జీవితం గడపాలి. "60" వచ్చే ముందు వరకు అన్ని బాధ్యతలు నిర్వర్తించాలి ఇంక "60" వచ్చింది అంటే బాధ్యతలు వదిలించుకొని షష్టిపూర్తి చేసుకుని దైవ చింతన, జపం, తపస్సులు లాంటివి చేసి పుణ్యం చేసుకుని మోక్షం సాధించేలాగా అమ్మను ప్రార్థించాలి. కాబట్టి స్వర్గ సుఖాలని, మోక్షాన్ని రెండింటిని ఇచ్చే అమ్మని మోక్షాన్ని ప్రసాదించమని, అలాంటి బుద్ధి కలిగేలాగా దీవించమని ప్రార్థిస్తూ ఈ నామంతో ప్రార్థించాలి.

ఉదాహరణకు ప్రహ్లాదుడు పుట్టుకతో విష్ణు భక్తుడు,
అతడిని పాము కరవడానికి వచ్చినప్పుడు లేకపోతే
కొండ మీద నుంచి పడవేసినప్పుడు, ప్రహ్లాదుడు
తను నారాయణ జపం వల్ల వచ్చిన పుణ్యం
ఉపయోగించుకోకుండా అన్నీ కాపాడే [illegible] భగవంతుడికే
అప్పగించాడు. అలా పుణ్య ఫలాన్ని వ్యర్థం చేయకుండా
పరమేశ్వరుడిని ఋణగ్రస్తుడిని చేసుకున్నారు.

మనం ఏదైనా కోరిక కోరుకుంటే దేవుడిని
మన పుణ్య ఫలాన్ని బట్టి, మన జప పుణ్యాన్ని
బట్టి మన కోరికలు నెరవేరుతాయి. కాబట్టి కోరికలు
కోరుకోకూడదు.

మానవుడి జీవితంలో షష్టిపూర్తి అవ్వక ముందు జీవితం
ఒకలాంటిది, అయ్యాక జీవితం ఒకలాంటిది. "60" వచ్చింది
అంటే ఇంక మనం ఈ సంసారిక జీవితం వదిలెయ్యాలి.
దైవ చింతన లోనే జీవితం గడపాలి. "60" వచ్చే ముందు
వరకు అన్ని బాధ్యతలు నిర్వర్తించాలి ఇంక "60"
వచ్చింది అంటే బాధ్యతలు వదిలించుకొని షష్టిపూర్తి
చేసుకుని దైవ చింతన, జపం, తపస్సులు లాంటివి
చేసి పుణ్యం చేసుకుని మోక్షం సాధించేలాగా అమ్మను
ప్రార్థించాలి. కాబట్టి స్వర్గ సుఖాలని, మోక్షాన్ని
రెండింటిని ఇచ్చే అమ్మని మోక్షాన్ని ప్రసాదించమని,
అలాంటి బుద్ధి కలిగేలాగా దీవించమని ప్రార్థిస్తూ
శ్రీ నామంతో ప్రార్థించాలి..

1st April 2011 — Friday.

(766) శుద్ధా - అమ్మవారు శుద్ధమైనది అని అర్థం.
అమ్మవారు శుద్ధి చేస్తుంది, శుద్ధమైనది, రెండూనూ.
కారాగారంలో నేరస్థులని బంధించి, అక్కడే ఒక
రక్షక భటుడు కూడా కాపలాగా ఉండినా ఆ నేరస్థుల
పాపం గాని, ఆ నేరస్థుల నేరం కాని ఎలాగైతే ఆ
రక్షక భటుడికి అంటవో అలాగే ప్రపంచం
అనే ఈ కారాగారంలో మనం అందరమూ బంధీలం
అయినా, మనం చేసే వాటిని అమ్మ చూస్తూ ఉన్నా మనం చేసిన
పాపాలకి, అమ్మకి ఏ సంబంధం ఉండదు.

Imp:- ఈ నామం జపిస్తే అమ్మ మన పాపాలన్నింటిని తొలగించి
మనకి శుద్ధత్వాన్ని ఇచ్చి శుద్ధి చేస్తుంది.

పూర్వపు రోజుల్లో రాజులందరూ రాజ్యాధికారం
తరువాత అడవిలో కొన్ని రోజులు ఉండి వాళ్ళు తెలిసో,
తెలియకో చేసిన తప్పులన్నింటికి యాగాల ద్వారా నో
లేక తపస్సు ద్వారా నో ఆ తప్పులన్నింటినీ [illegible]
తొలగించుకొని శుద్ధత్వాన్ని పొంది తర్వాత స్వర్గానికి
వెళ్ళేవారు.

అమ్మ తప్పు చేసిన ప్రతి మనిషికి తప్పును
దిద్దుకునే అవకాశం ఇస్తుంది, ఆ అవకాశాన్ని సద్వినియోగం
చేసుకోకుండా మళ్ళీ తప్పు చేస్తే అప్పుడు అమ్మ
శిక్ష విధిస్తుంది. అమ్మ ఎందరో రాక్షసులైన
రక్తబీజుడిని, మహిషాసురుడిని, ఇంకెందరినో వధించింది
అయితే, వాళ్ళకి తప్పును తెలుసుకుని దిద్దుకునే
అవకాశం ఇచ్చింది. కాని, వాళ్ళు మళ్ళీ తప్పు చేస్తే

2nd April

(767)

అప్పుడు అమ్మ వాళ్ళను వధించింది. వాళ్ళను అమ్మ
వధించినందుకు అమ్మ శుద్ధత్వానికి ఏమీ కాలేదు,
పైగా ఆ రాక్షసులు అమ్మ చేతిలో వధించబడి
మోక్షాన్ని, శుద్ధత్వాన్ని పొందారు.
మన పాపాలను తొలగించి, శుద్ధత్వాన్ని
ప్రసాదించమని అమ్మని ఈ నామంతో ప్రార్థించాలి.

2nd April 2011.

Saturday

Congrats!!! India won the worldcup-2011.

(767) జపాపుష్పనిభాకృతిః:
జపా - మందార ; పుష్ప - పుష్పములతో ; నిభా - సమానమైన ;
ఆకృతిః - (ఆకారం) రూపం. ; పుష్పం అంటే రూపం వికసించే గుణం అని అర్థం
మందార పుష్పములతో సమానమైన ఆకారం కలిగినది అమ్మ
అని ఈ నామం అర్థం.
(*) మందార పుష్పం అమ్మవారికి చాలా ఇష్టం.
(**) మనం పూజ చేసిన తర్వాత అమ్మ ముఖాన్ని ఒక్క
నిమిషం పరిశీలించి చూస్తే అమ్మ ముఖంలో మనం చేసిన
పూజ అమ్మకు నచ్చిందా అంటే చేరిందా లేకపోతే అమ్మకు
చేరలేదా అనేది తెలుస్తుంది. ఒకవేళ మనం పూజ చక్కగా
చేస్తే అమ్మ ముఖం ఆనందంగా కనిపిస్తుంది లేకపోతే
సరిగ్గా చేయకపోతే అమ్మ ముఖం చిట్లించుకున్నట్లుగా
కనిపిస్తుంది. ఇది సత్యం. అందరికీ కనిపిస్తుంది.
మనం అమ్మకి సమర్పించే పత్రి, పూలు, ఫలాల కన్నా

మన మనస్సులోని భక్తి చాలా ముఖ్యమైనది. ముందు
మన మనస్సులో అమ్మ రూపాన్ని మనం చదివే నామానికి
తగ్గట్టు ఊహించుకోగలగాలి. అలా అమ్మను ఆ నామానికి
తగ్గట్టు ఊహించుకుని చదివితేనే మనం పూజ
సక్రమంగా చేసినట్టు. అలాంటి పూజ అమ్మకు చేరి
అమ్మకి ఆనందాన్ని కలిగిస్తుంది. కాబట్టి, కలియుగంలో
నామస్మరణలోనే పుణ్యం కలుగుతుంది కాబట్టి, చక్కగా
జపం చేస్తూ సక్రమమైన మార్గంలో పూజ చేసి, మన
మనస్సుని ఒక ఐదు నిముషాలకైనా అమ్మ మీద
లగ్నం చేస్తే అమ్మ చాలా సంతోషించి, పూజ అయిన
తరువాత అమ్మని, అమ్మా! పూజ నచ్చిందా అని
అడగగానే ఒక్క క్షణం లోపలే నచ్చిందో, లేదో
తన ముఖంలోనే చూపిస్తుంది అమ్మ. కాబట్టి మనం
చేసిన పూజ అమ్మకు నచ్చి, అమ్మ ముఖం వికసించాలి
అని ప్రార్థిస్తూ, అమ్మని ఈ నామంలో ప్రార్థించాలి.

20th April 2010 (767) contd. Wednesday

అమ్మ యొక్క సహస్ర నామాలు హయగ్రీవుడు
అగస్త్య మహర్షికి చెప్పారు. హయగ్రీవుడు చెప్పిన
నామాలను అన్నీ విని అగస్త్యుడు "నాకు సంతృప్తి
సరిపోవటంలేదు. ఇంకా చెప్పు" అని అన్నాడు. అప్పుడు
అమ్మే పూర్ణంగా ప్రత్యక్షమై హయగ్రీవుడిని
అగస్త్యునికి లలితా త్రిశతి కూడా చెప్పమంది.
ఆశ్చర్యపడ్డాడు హయగ్రీవుడు. "ఇప్పటిదాకా నాకు
కనపడని అమ్మ ఇప్పుడు అగస్త్యుని వల్ల నాకు

కనిపించిందా." అని అన్నారు. ఎంత జపం చేసినా
ఆ జపానికి తగ్గట్టుగా వికసించే శక్తిని కలది అమ్మ.
హయగ్రీవుడు భక్తితో కాకుండా వేగా అలా అమ్మ
నామాలు చెప్పారు అగస్త్యుడికి. అగస్త్యుడు చాలా
భక్తితో విన్నారు అమ్మ నామాలను. అందుకే
అమ్మ హయగ్రీవుడికి కనబడలేదు, అగస్త్యునికి
కనిపించింది. పూర్వపు రోజుల్లో ఒక కథ చెప్పేవారు,
అది ఏమిటంటే ఒక రాజుగారి కోడలు అసలు నెయ్యిన
పిండివంటలని తెచ్చుకుని అమ్మవారి గద్దగుడిలో
కూర్చుని తింటే అమ్మ ముక్కు మీద వేలు వేసుకుని
కనపడిందంట ఆ కోడలికి. అంటే మనం మన
మనస్సులో ఏం చేసామో అది అమ్మ ముఖంలో
కనిపిస్తుంది. పైగా ఆ కథ సత్యం కూడా.

కాబట్టి మన భక్తి పూర్వకంగా పూజ
చేస్తే అమ్మ ముఖం ఆనందంగా కనిపిస్తుంది, లేదు
దురదృష్టం కొద్దీ మొక్కుబడిగా చేసామా అమ్మ
ముఖం చిట్లించుకుని కనిపిస్తుంది. కాబట్టి మనం
మనస్ఫూర్తిగా పూజ చేయాలి, అలా
చేయడానికి మనకి తగినంత సమయాన్ని, శక్తిని
ఇవ్వమని, అమ్మని అనుగ్రహించమని
ప్రార్థిస్తూ అమ్మని ఈ నామాలతో పూజించాలి.

# Information Regarding Devi Khadgamala Stotram.

The devas prayed Lalitha Devi to kill Bhandasura. When she started for the war with Bhandasura, She was accompanied by the powers called Anima (అణిమ), Mahima (మహిమ) etc, Brahmi (బ్రాహ్మి), Kaumari (కౌమారి), Vaishnavi (వైష్ణవి), Varahi (వారాహి), (మాహేంద్రి) Mahendri, chamundi (చాముండి), Mahalakshmi (మహాలక్ష్మి), Nithya Devathas (నిత్య దేవతలు) & Avarna Devathas (ఆవర్ణ దేవతలు) who occupied the Srichakra.

సంపత్కరి (Sampathkari) was the captain of elephant regiment.
అశ్వారూఢ దేవి (Aswarooda Devi) was the captain of cavalry.
The army was commanded by దండిని (Dhandini) riding on a chariot called కిరి చక్ర (Kiri chakra) assisted by Manthrini (మంత్రిణి) riding on a chariot called Geyachakra (గేయ చక్ర).
Jwala Malini (జ్వాలా మాలిని) protected the army by creating a fire ring around it.
పరాశక్తి (పరాశక్తి) (Para shakti) rode in the center on the chariot of Srichakra.

నిత్యదేవి (Nithya Devi) destroyed a large chunk of Bhandasura's armies.
బాలాదేవి (Bala Devi) killed the son of Bhandasura, and మంత్రిణి (Manthrini) and దండిని (Dhandini) killed Bhandasura's brothers vishanga & vishukra (విశంగ్, విశుక్ర).
when Asura's created blockade for the marching army, Sri Lalitha Tripura Sundari [శ్రీ లలితా త్రిపుర సుందరి దేవి] created Ganesha [గణేశం] with the help of kameshwara to remove the blockade.
Then Bhandasura created the asuras called Hiranyaksha & Hiranyakasipu & Ravana. Then Devi created 10 Avataras of Lord vishnu & destroyed them.
She killed all the Asura's army using Pasupathastra (పాశుపతాస్త్ర) and killed him with kameshwarasthra (కామేశ్వరాస్త్ర). The gods then praised her. she then created Manmatha for the good of the world.

## Lalitha Sahasranamam's Structure :-

The sloka is organised based on five works (పంచ కృత్యం). They are: సృష్టి (shrishti), స్థితి (Sthithi), & సంహారం (Destruction), తిరోధానం (Chiding), and అనుగ్రహం (Blessing).

Devi is herself described as:

"సృష్టి కర్త్రీ బ్రహ్మ రూపా, గోప్త్రీ గోవింద రూపిణీ,
సంహారిణీ రుద్ర రూపా, తిరోధానకరీశ్వరీ
సదాశివ అనుగ్రహదా పంచకృత్య పరాయణా"

This means: Devi is doing సృష్టి as బ్రహ్మ, స్థితి as విష్ణు (గోవింద), సంహార as రుద్ర, తిరోధానం as ఈశ్వర & అనుగ్రహం as సదాశివ.

This 5 entity mention above are known as "పంచ బ్రహ్మం" (Pancha Bramham). when she takes all those 5 functions away from them & performs everthing by herself then they are called "పంచ ప్రేతం"

In the first 3 slokas

శ్రీమాతా - Great Mother - సృష్టి

శ్రీ మహారాజ్ఞీ - Great ruler - స్థితి

శ్రీమత్ సింహాసనేశ్వరీ - (one who sits on Simhasanam and manges) Samharam.

Here managing includes balance b/w life & death.

The rest of slokas cover తిరోధానం & అనుగ్రహం.

Next namas

"చిదగ్ని కుండ సంభూతా, దేవకార్య సముద్యతా" tell us that devi arose from the fire of knowledge to help Devas in their task (war against asuras)

from

"ఉద్యద్భాను సహస్రాభా" to "శింజాన మణి మంజీర మండిత శ్రీ పదాంబుజా" all her parts like face, fore head, eyes, mouth, tongue, voice, hands, hip, legs has been described.

There after Devi's place - చింతామణి గృహం, her war against Bhandasura, and the kundalini Shakti, her properties (like who can reach her & who cannot) etc has been described.

Lalitha Sahasranamam was composed by 8 vaag devis (ఎనిమిది వాక్ దేవతలు) upon The command of Devi Sri Lalitha. ఎనిమిది వాక్ దేవతలు: వశిని (vasini), కామేశ్వరి (కామేశ్వరి) (kameshwari), మోదిని (Modhini), విమల ది (vimala), Aruna (అరుణ), జయిని (Jayini), సర్వేశ్వరి (సర్వేశ్వరి) (Sarveshwari), కౌళిని (kaulini).

This ~~Stotr~~ Sahasranamam Stotram was said by హయగ్రీవ (Hayagreeva:- form of vishnu) to Agasthya Maharshi (అగస్త్య మహర్షి) in (బ్రహ్మాండ పురాణం (Brahmanda Purana).

## Sri Nagaram Description :-

Sree Nagaram (శ్రీ నగరం) consists of 25 circles circling it. They are made of:
Iron, Steel, copper, Lead, alloy made of 5 metals, silver, gold, white Pushparaaga Stone, Red Pushparaaga stone), onyx, diamond, Vaidoorya, Indra neela (topaz), Pearl, Marakatha, coral (Pagadam), ninegems (~~Nava~~ నవ రత్నాలు) & mixture of gems & Precious stones.

8th Street → కదంబ వనం → కadamba forests → Presided by Syamala (శ్యామల).
15th street → అష్టదిక్పాలకులు (AstadigPalakas).
16th Street → వారాహి Alias దండిని → Commander in chief & also Syamala has a house here.
17th Street → Different Yogini's.
18th Street → Maha Vishnu (మహావిష్ణు).
19th street → Esana (ఈశాన)
20th Street → తారాదేవి (tharaDevi)
21st street → వరుణి (Varuni)
22nd street → కురుకుల్ల (Kurukulla)
23rd street → Marthanda Bhairavi (మార్తాండ భైరవి)
24th Street → చంద్రుడు (Moon)
25th Street → మన్మథుడు (Manmatha - Presiding forest of Love)

So, Imp:

In the center of Sri Nagara → (Maha Padma Vana forest)
మహాపద్మ వన and within it చింతామణి గృహం.
(Chintamani Gruha).




and within all these is Srichakra.

In the center of Srichakram on the throne of Pancha Bramhamas on Bindu Peeta (dot plank) called Sarvanandamaya sits Lalitha Devi.

Sri Nagaram → Srichakram → Bindu Peetam → Devi.

So, Imp: శ్రీనగరం → శ్రీ చక్రం → పంచ బ్రహ్మాసనాస్థితం →
బిందు పీఠం (సర్వానందమయం) →
లలితా త్రిపుర సుందరీ దేవి.

More Detailed Description of Srichakram :-

In "SRICHAKRA" are the following:

1, A Square called "త్రైలోక్య మోహనం" that means most beautiful in the 3 worlds.

2, A 16-Petalled Lotus called "సర్వాశా పరిపూరకం" that means fulfiller of all desires.

3, A 8-Petalled Lotus called "సర్వసంక్షోభణం" that means all the cleanser.

4, A 16-figured Corner figure called "సర్వ సౌభాగ్యం" means all luck.

5, The external ten cornered figure called "సర్వార్థ సాధకం" / "సర్వార్థ సాధకం" means giver of all assets.

6, The internal 10 cornered figure called as "సర్వరక్షాకరమ్" ~~called all~~ means all protector.

7, The 8-cornered figure called "సర్వ రోగ హరం" means cure of all diseases.

8, Triangle called "సర్వ సిద్ధి ప్రదం" means giver of all powers.

9, And a dot called "సర్వానంద మయం" means all pleasures.

28th April 2011 Thursday

(771) ప్రియవ్రతా

తన ప్రియుడైన శంకరుడినే ప్రథమముగా కలిసిన స్త్రీ అమ్మవారు అని అర్థం. అంటే శంకరుడికి ఇష్టమైన మాటలే మాట్లాడడం, శంకరుడికి ఇష్టమైన పనులే చేస్తుంది అని అర్థం. శంకరుడు కూడా తనకొచ్చే ఆలోచనలను, తను తీసుకున్న నిర్ణయాలు వెంటనే ముందు అమ్మకి చెప్పి తరువాత వేరే వాళ్ళకి చెప్పడమో లేక ఆచరించడమో చేస్తారు, అలాగే అమ్మవారు కూడా ముందు శంకరుడికి చెప్పి తరువాత చేస్తుంది. మనం మామూలుగా కూడా భర్త దగ్గర భార్య, భార్య దగ్గర భర్త ఏ రకమైన రహస్యాలు గాని లేకపోతే ఇద్దరూ కూడా ఇద్దరిని అర్థం చేసుకుని, ఎవరి మనస్తత్వం ఎలా ఉంటుందో ఇద్దరికీ అర్థమయ్యి దానికి తగ్గట్టుగా ఇద్దరూ నడుచుకుని ఆనందంగా ఉంటారు.
సత్యభామా, రుక్మిణీ ఇద్దరిలో కృష్ణుడు ఎక్కువ ప్రాధాన్యం రుక్మిణీ దేవికే ఇచ్చేవాడు. రుక్మిణీ దేవి కృష్ణుడు తనకేమైనా చెప్తే అది గోప్యంగా ఉంచేది, అన్నీ తన భర్తకి ఇష్టమైనవే చేసేది, అదే సత్యభామ అయితే తన చెలికత్తెలతో సహా అందరికీ చెప్పి తన తండ్రి అయిన సత్రాజిత్తుకి కూడా తెలియచేసేది. అందుకే కృష్ణుడు రుక్మిణీదేవికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేవాడు.
కాబట్టి ప్రేమ ద్వారానే భార్యాభర్తలు ఒక్కటి అవుతారు కాని బహుమతులు ఇచ్చుకుంటే అవరు అని అమ్మ మనకి భార్యాభర్తలు ఎలా ఉండాలో తెలియజేసే నామం ఇది.

29th April 2011. Friday

(772) దురారాధ్యా - దుర్, ఆరాధ్యా.

దుష్టుల చేత ఆరాధింప దగినది కాదు, కేవలం యోగ్యుల వల్లే ఆరాధింప దగినది అని అర్థం.

ఉదాహరణ :- ఎప్పుడైనా సరే మంచి శాంతమైన మనస్సుతో మాత్రమే చేయాలి. అసూయతో, వేరేవాళ్ళ మీద ఈర్ష్యతో, కోపంతో మాత్రం చేయకూడదు, ఒకవేళ అలా చేస్తే అది దొంగ పూజ అవుతుంది. చేతులు జోడించి చేతులతో పూజ, ప్రదక్షిణ చేసి పాదాలతో పూజ, మంత్రాలతో ఉచ్ఛారణతో నోటితో పూజ, ఇలా అన్ని అవయవాలతోనూ పూజ చేస్తాం మనం. ఒకవేళ మనస్సు లగ్నం కాకపోతే ఆ రోజు పూర్తిగా పూజ మానేయడం మంచిది.

→ దుష్టమైన ఆలోచనలు చేసే వారితో ఆరాధింపబడనిది ఇష్టపడనిది అమ్మ. ఒకళ్ళ గురించి చెడుగా కోరుకోవడం కూడా దుర్ ఆరాధ్యా లోకే వస్తుంది. అమ్మని ఆరాధించేటప్పుడు పూర్తి నమ్మకంతో ఆరాధించాలి. అలాగైతేనే ఆరాధించాలి, లేకపోతే ఆరాధించకూడదు. చెడ్డ ఆలోచనలు మనకి రాకుండా ఉండమని, మరియు పూజ గానీ ఆరాధన కానీ చేసేటప్పుడు పూర్తి నమ్మకంతో శాంతితో భక్తితో చేయాలని చెప్పే నామం ఇది.

30th April 2011 — Saturday

(773) దురాధర్షా.

అమ్మకి చేరేలాగా పూజ చెయ్యకుండా ఏదో చేసెయ్యాలి కాబట్టి (చేస్తే) చేసాను అని అన్యట్లు చేస్తే, అమ్మ ఆనందించదు. ఆ అర్చన చేసేవాళ్ళకి కూడా ఫలితాన్ని ఇవ్వదు.

అమ్మవారు ఎప్పుడూ కూడా చాంచల్యం లేని వాళ్ళకి వశం అవుతుంది. ఇంద్రుడు కర్మేంద్రియాల అధికారి. ఎవరు ఎప్పుడు తపస్సు చేసినా / చేస్తున్నా ముందు అప్సర కాంతలను పంపుతాడు. అప్పుడు వాళ్ళు చలించకపోతే, తపస్సు భంగం పట్టించుకుండా ఉండేవాడికి మాత్రమే దేవతలు ప్రత్యక్షం అవుతారు. ముందు ఇంద్రుడు వాళ్ళ ఇంద్రియాలను పరీక్షిస్తాడు, పరీక్షించమని అమ్మ చెప్తుంది, అందుకే అప్సరకాంతలను పంపుతాడు. అమ్మకి నిశ్చల మనసుతో భక్తులు చేయటం కూడా తేలికైన పని కాదు. చాంచల్యం ఉంటే యథార్థ భక్తి ఉండదు, అందుకే అమ్మ వశగత అవదు. అమ్మని మానసికంగా మెప్పించాలి, మెప్పించాలి తప్ప ఎన్ని పుష్పాలతో పూజ చేసినా ఆవిడ ఆనందించదు. మానసికంగా మెప్పించాలి అంటే భక్తితోనే సాధ్యం. ఏకాగ్ర భక్తితో అమ్మని మెప్పించాలి అని తెలియజేసే నామం ఇది.

2nd May 2011 Monday

(774) పాటలా కుసుమ ప్రియా.

-పాటలా (ఎరుపులో ఉన్న) పుష్పాలు అమ్మవారికి ఇష్టం అని పై అర్థం.

అసలు దేవతలకు ఇది ఇష్టం, ఇది అయిష్టం అని ఉండకూడదు, కాని ఈ పేరు అర్థం ఇలా ఎందుకు ఉంది అని మనం ఆలోచించాలి. [సహజంగా ఇష్టానికి వ్యతిరేక పదంగా అయిష్టం అంటాం, కాని, అది తప్పు. ఇష్టానికి వ్యతిరేక పదం అనిష్టం].

పై పేరు అర్థం ఏంటంటే :-

ఒక రాక్షసుడు తనకి ఇష్టమైన పుష్పాలన్నింటిని వనాలుగా వేసాడు. అతనికి పాటలాపుష్ప వనం ఎక్కువగా ఇష్టం ఉండేది. ఆ పుష్పం లేత ఎరుపు రంగులో [అప్పుడే పండుతున్న దానిమ్మ గింజల రంగులో] ఉండేది. ఆ రాక్షసుడిని చంపడానికి ఒక ఆలోచన చేసింది. అదే వనంలో ఒక భ్రమర రూపంలో అమ్మ ఉండేది. ఆ తుమ్మెద చేసే ఝంకార నాదం అప్పుడు చాలా గట్టిగా, చాలా భయంకరంగా చేసేది. ఆ రాక్షసుడు ఆ భ్రమరాన్ని చంపేయమని ఆజ్ఞాపించాడు. ఎవరు ఎంత ప్రయత్నించినా ఆ భ్రమరాన్ని పట్టుకోగలిగేవారు కారు, ఒకసారి బాగా పొగ పెట్టి ఆ భ్రమరాన్ని బయటికి తరిమారు. అయితే అమ్మ మెల్లగా ఒక చిన్న సూక్ష్మ రూపంలో ఒక పుష్పంలో ఉండి, ఆ రాక్షసుడు, ఆ భ్రమరం వెళ్ళిపోయింది అని ఒక పుష్పం కోసుకుని వాసన చూసే వేళ, అమ్మ ఆ సూక్ష్మ రూపంలో అతని ముక్కులోంచి బుద్ధిలోకి

ప్రవేశించి, అతడిని చంపింది. ఆ రకంగా ఆ రాక్షస వధని ఆ పాటలీపుష్ప వనంలో చేసాను అని ఆ పాటలీ పుష్పం ధరించేది అమ్మ. పాటలీపుష్పం అచ్చు మందార పుష్ప ఆకారంలో ఉంటుంది.

నెమ్మదిగా వికసించే పుష్ప అని ఆ పుష్ప పేర మందారం అయ్యింది. పాటలీ పుష్పంలో చిన్న చిన్న ఆకారం కలిగిన రేకులు చాలా ఉంటాయి. పాటలం అంటే ఎక్కువ సంఖ్య అని అర్థం. ఆ వధ జరిగిన తర్వాత ఒక రోజంతా అమ్మ పాటలీపుష్పాన్ని ధరించింది. కాబట్టి ఆవిడకి పాటలీపుష్ప కుసుమ ప్రియా అని పేరు వచ్చింది.

3rd May 2011 Tuesday.

(775) మహతీ!

మహాన్ అంటే గొప్పవారు అని అర్థం,
మహతి అంటే గొప్పది అని అర్థం. (సామాన్య అర్థం).

→ చూడడానికి వీలైనది కాబట్టి లోకానికి లోకం అనే పేరు వచ్చింది. మానవుడు ఉండే లోకం "భువ" లోకం.

→ మనకున్న పద్నాలుగు లోకాలను (14) మోసేది పాతాళంలో ఉన్న సర్పాలు, అష్టదిగ్గజాలు. వీటన్నిటిని మోయగలిగిన వాడు ఆదిశేషుడు. ఇవన్నీ పాలించగలిగిన అమ్మది ఎంత గొప్ప శక్తి.

→ చిన్నదైన వస్తువును పెద్దది చేయగలిగిన శక్తి అమ్మకి ఉంది. ఆ శక్తి వల్లే గర్భంలో పిల్లలు పెరుగుతున్నారు. ఆ తర్వాత కూడా అమ్మ దయ వల్ల చక్కగా ఉంటారు.

→ గర్భిణులు లలితా సహస్ర నామాలు పఠిస్తే అమ్మ అనుగ్రహం వల్ల పిల్లలు చక్కగా ఏ అపాయం లేకుండా పుట్టి పెరుగుతారు.

→ భండాసురుడిని చంపాల్సిన వేళ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అతడిని చంపలేక లలితా దేవిని ప్రార్థించారు. అప్పుడు అమ్మ వెంటనే ప్రత్యక్షమై ఏం కావాలో అడిగింది. అప్పుడు భండాసురుడిని చంపాల్సిందిగా కోరారు. ఆవిడ మొత్తం ఆడవాళ్ళ సైన్యంతో అతడిని వధించింది ఎందుకంటే భండాసురుడికి ఆడవాళ్ళంటే విపరీతమైన చిన్న చూపు. ఆడవాళ్ళ శక్తి ఏంటో చూపటానికే ఆవిడ మంత్రిణిలను, దండినిలను, ఆడవాళ్ళ సైన్యాన్ని ఏర్పాటు చేసి ఆ అసురుడిని వధించింది.

ఇదంతా చూసిన బ్రహ్మాదులు వెంటనే అమ్మని "మహాలిని" అని స్తుతించారు.

→ కాబట్టి, గర్భిణులు చక్కగా ఉండి ప్రసవం ఆనందంగా జరగాలన్నా లేక ఏ అసుర శక్తి దగ్గరికి రాకుండా ఉండాలన్నా అమ్మ యొక్క "మహాలిని" అనే నామాన్ని పఠించాలి.

(776) → Missed.

5th May 2011

Thursday

(777) మందారకుసుమ ప్రియా

మందార పుష్పాలంటే అమ్మకు చాలా ఇష్టం అని పై నామం యొక్క సామాన్య అర్థం.

మందార పుష్పం అంటే నెమ్మదిగా వికసించేది అని అర్థం — నెమ్మదిగా వికసించే భక్తి ఏ భక్తులలో ఉందో వాళ్ళకి అమ్మకి ఇష్టం అని అర్థం.

అంటే ఉదాహరణకు చిన్న పిల్లలను దేవుడికి దణ్ణం పెట్టమంటే దణ్ణం పెడతారు, కొంచెం పెద్దగా అయ్యాక మంచి మార్కుల కోసం దణ్ణం పెడతారు, ఆ తర్వాత అలా అలా భక్తి పెరుగుతూ ఆ తర్వాత మనకెవ్వరూ చెప్పకుండానే మన యందు భక్తి భావం పెరిగే స్థాయికి చేరుతుంది. అలా భక్తి మెల మెల్లగా పెరిగి మనకి అమ్మ గురించి తెలిసి పూర్తిగా మన అమ్మ యందు భక్తి కలిగితే, అప్పుడు, అలా కలిగిన భక్తి, అలాంటి భక్తులు అమ్మకి ఇష్టం అని అర్థం.

మనం ఎంత భక్తి అర్పిస్తామో అంత వికసించి అమ్మ కనిపిస్తుంది అమ్మ. (పటం లా).

అలా కనిపిస్తే "నా ముఖం ఎంత వికాసంతో ఉందో, దర్శించ గలిగావు కదా, రా" అని అమ్మ ఆనందిస్తుంది.

మనలో చాలామంది కోరికల కోసమే ఆవిడని ఆరాధిస్తాం, అవి తీరకపోతే పూజించడం మానేస్తాం. కానీ, అమ్మ మనకేది మంచిదో అదే చేస్తుంది. ఎప్పుడైనా సరే సుఖంలోనూ, దుఃఖంలోనూ అమ్మ పాదాలను పట్టుకునే వాళ్లే అమ్మకి ఇష్టం అని చెప్పే నామం ఇది.

6th May. 2011 — Friday.

(778) వీరారాధ్యా.

వీరుల చేత ఆరాధింపబడేది అమ్మ అని అర్థం (సామాన్య).
వీరులు అంటే పరాక్రమ పరులు అని అర్థం కాదు.
ఒక ప్రహ్లాదుడు, ఒక శంకర భగవత్ పాదులూ
వీళ్ళందరూ వీరులు.

విలువైన ముఖ్య వస్తువు ముఖ్యమైన పాత్రలలో
ఉంటేనే దానికి విలువ. బంగారు వస్తువు ఇనుప
పెట్టెలో దాచము, అలాగే బంగారు పెట్టెలో
రాగి రేకు దాచము, అలాగే ధర్మాత్ముల చేతనే
కొలువబడేది అమ్మ అని అర్థం.

7th May. 2011 — Saturday.

(779) విరాడ్రూపా - విరాట్ రూపా.

ప్రపంచమంతా తన రూపంగా కలిగినది అమ్మ అని అర్థం
అమ్మ ఉండే మేరు పర్వతం, శ్రీ చక్ర ఆకారంలో ఉంటుంది.
గంగా రూపాన్ని కూడా ధరిస్తుంది అమ్మ.
ప్రపంచమంతటిలో కూడా మనం ఏం చూసినా
అమ్మ రూపంతో దాన్ని మనం సమన్వయం చేసుకోవాలి
ఉదాహరణకు కొండలని చూసి అమ్మ యొక్క జుట్టులాగా
ఉంది కదా అని, నీటి ప్రవాహాన్ని చూసి అమ్మ యొక్క
గంగా రూపమని అలా భావించాలి. అలా భావిస్తూ
ఉంటే ఆ భావన అలవాటు అయిపోయి మనకి విశ్వంలో
ఏం చూసినా అమ్మ రూపంతో సమన్వయం అవుతు
అయిపోయి విశ్వం అంతా పరబ్రహ్మమే కనిపిస్తుంది.

9th May 2011 — Monday

(780) విరజా.

బుద్ధిలో ఉన్న దోషాలని, పాపాల ఆలోచనలను అజ్ఞతలని తొలగాలి అనే ఆలోచన చేస్తూ ఉంటుంది అమ్మ. శిక్షలు వేసి అమ్మ పాపాలను తొలగిస్తుంది కూడా.

(భా) మన పాపపంకిలాన్ని తొలగించే శక్తి కేవలంగా అమ్మకి మాత్రమే ఉంది అని తెలియజేసే నామం ఇది.

10th May 2011 — Tuesday

(781) విశ్వతోముఖీ.

లం (doubt)
"వం" అనేది పృథ్వి యొక్క బీజాక్షరం.
వినాయకుడికి ఎరుపురంగు దుస్తులు వేసుకుని ఉంటాడు

విశ్వమంతా కనిపించి 3 లేని కళ్ళు పెట్టి చూస్తూ ఉంటుంది అని ఈ నామం యొక్క అర్థం.
ఎటూ కూడా చెదిరిపోకుండా విశ్వాన్ని పట్టుకుని ఉంటుంది.
ప్రపంచం అంతా శ్రీచక్రం ఆకారంలో ఉంటుంది.

14th May. 2011. Saturday

(783) పరాకాశా. - పర, ఆకాశా.
ఆకాశం కన్నా గొప్పది, ఆకాశం చేరులేనిది కూడా అమ్మ
ఇమిడగలుగుతుంది అని అర్థం.
జ్యోతిః అంటే కర్పూరపు దీపారాధన.
పరంజ్యోతిః అంటే శరీరం లోపల దైవాన్ని చూపించగలిగే
జ్యోతి అని అర్థం.
పరాదృష్టిః అంటే చూడదగినదే, కాని మనం
చూడడానికి వీలులేకుండా, మనకి అంతటి శక్తి లేకుండా
ఎక్కడో ఉన్నది ఋషులు చూడగలరు. దాన్ని
పరాదృష్టిః అని అంటారు.
మన శరీరంలో కూడా పంచ భూతాలు ఉన్నాయి.
పృథివీ - పాదాల క్రింది భాగం.
ఆప్ - కటి భాగం.
తేజో - బొడ్డు / నాభి భాగం.
వాయువు - హృదయం
ఆకాశః - బ్రహ్మరంధ్రం ఉన్న భాగం.
కొబ్బరి అన్నారు బ్రహ్మరంధ్రం ~~..~~ దగ్గర (దాని పైన)
కొట్టుకుంటుంది.
బొట్టు పెట్టుకునే చోటు నుంచి 12 వేళ్ళు పైకి పెట్టుకుని
వెళ్ళి ఉంటే, 12వ వేలు ఎక్కడ ఆగుతుందో అదే
బ్రహ్మరంధ్ర స్థానం. అక్కడే అమ్మ ఉంటుంది. అదే
పరాకాశం.
కపాలం మొదలయ్యేక సరిగ్గా రెండు అంగుళాలు
ఎక్కడ ఆగుతాయో అదే బ్రహ్మరంధ్రం.

18th May 2011 Wednesday.

(786) మార్తాండ భైరవారాధ్యా.

మార్తాండ భైరవుడు అనే వ్యక్తి చేత ఆరాధింపబడింది అమ్మ అని సామాన్య అర్థం.

అమ్మవారు మణిద్వీపంలో చింతామణి గృహంలో ఉంటుంది అని అనుకున్నాం. పైగా 24 ప్రాకారాలు చుట్టూరా ఉంటాయి అది మనకి తెలుసు. అమ్మవారి ఇల్లే శ్రీమన్నగరం. అందుకే ఆవిడ శ్రీమన్నగరనాయికా. ఆ 24 ప్రాకారాల్లో, 22వ ప్రాకారాన్ని మార్తాండ భైరవ ప్రాకారం అంటారు.

వర్చస్మతి, చారుమతి – వీరిద్దరూ మార్తాండ భైరవుడి భార్యలు.

మార్తాండ భైరవుడు 22వ ప్రాకారానికి రక్షకుడు.

మణిమల్లుడు/మణిమల్లుడు అనే రాక్షసుడు లోకాలన్నిటి మీదకి దూకి నాశనం చేయసాగాడు. అప్పుడు దేవతలందరూ వెళ్ళి శివుడిని రక్షించమని ప్రార్థించారు.

ఆ మణిమల్లుడిలో సూర్యశక్తి ఎక్కువగా ఉంది అని తెలుసుకున్న శివుడు, అంతకన్నా ఎక్కువ శక్తి తనలో ఉండాలని సూర్యుడి ఉపాసించాడు

అసితాంగ భైరవ – ఈ రూపంలో ఉన్న శక్తి సరిపోదు అని అనుకుని

రురు భైరవుడు. – 2వ రూపం

చండ భైరవుడు. – 3వ రూపం

క్రోధ భైరవుడు. – 4వ "

ఉన్మత్త భైరవుడు. – 5వ "

కపాల భైరవుడు – సరిపోలేదు అని అనిపించి (6వ)

సంహార భైరవుడు – ఇంకా పెంచుకోవాలి శక్తి అనిపించింది (7వ)

భీషణ భైరవుడు – 8వ రూపం.

మార్తాండ భైరవుడు – సూర్య శక్తిని పూర్తిగా
(ఈ రూపం సరిపోయింది అనిపించింది) స్వీకరించాడు.
ఆ రూపం చాలా నచ్చింది ~~భైరవుడికి~~ శివుడికి. ఆ రూపంలో
ఆ మణిమల్లుడిని వధించాడు.

ఆ మార్తాండ భైరవుడి రూపం, అమ్మ 12వ ఏటలా
ఎలా ఉందో, ~~అలానే~~ అలానే ఉంది. కాబట్టి
శివుడి రూపంలో శక్తిగా ఉన్నది అమ్మవారే. ఆ
రూపంలో శివుడు ఆరాధించింది స్త్రీ రూపంలో
ఉన్న అమ్మవారిని. కాబట్టి ఈ నామం వచ్చింది.

19th May. 2011 Thursday.

(487) మంత్రిణీన్యస్త రాజ్యధూః

మంత్రిణీ – మంత్రమును కలగచేసేది.
(ఆలోచనను.)

ఆ ఆలోచనలు ఇచ్చేవారు ఆడ మనిషి అయితే మంత్రిణి
మగ " " మంత్రి.

న్యస్త – ఉంచబడిన.

రాజ్యధూః – రాజ్య భారము.

→ ఒక మనిషి మీద రాజ్య భారము ~~[illegible]~~ వేసిన స్త్రీ ~~[illegible]~~ లలితాదేవి అని ఈ నామం అర్థం. – సామాన్య అర్థం.

మొత్తం స్త్రీ సైన్యాన్ని ఏర్పాటు చేసిన మొట్ట మొదటి [illegible] లలితాదేవి.

అమ్మవారు శ్యామలా దేవిని పిలిచి, మంత్రిణిగా
నియమించి, "మీరు రాజ్యాన్ని ఏలండి, మీకు మీరే
నడిపించుకోండి, నేను ఎలా నడిపించానో అలాగే
మీరు నడిపించుకోండి; ఒకవేళ మీరు ఏదైనా తప్పు
చేస్తే వెంటనే నేను వచ్చి సరిదిద్దుతాను" అని
చెప్పింది, అనేది ఈ నామానికి అర్థం.

24th May 2011 — ~~Friday~~ Saturday

(789) ఓం జయత్ సేనా (జయత్సేనా)

ఏ యుద్ధమైనా జరిగినా లేక ఏ యుద్ధమునకైనా
వెళితే ఆ సైన్యాన్ని జయించడమే లక్షణంగా కలిగిన
సైన్యం అమ్మది అని ఈ నామం యొక్క అర్థం.

→ పురాణాలూ, ఇతిహాసాలు చదివితే మానసిక స్థైర్యం
దానంతట అదే వస్తుంది. దానికోసం (ఆత్మస్థైర్యం కోసం)
వేరే చోటికి వెళ్ళక్కరలేదు.

→ మనుషులు చాలా రకాలు ఉంటారు. వాళ్ళు
1. అధములు – ఏదైనా సరే మొదలుపెట్టే ముందే భయపడి
ఇంక దాన్ని మొదలుపెట్టరు.
2. మధ్యములు – మొదలుపెట్టి, ఏదైనా విఘ్నం వస్తే
అప్పుడు మానేస్తారు.
3. ధైర్యవంతులు – మొదలుపెట్టి, అడ్డులు వచ్చినా పూర్తి చేస్తారు.

అమ్మవారు యుద్ధం చేసేటప్పుడు,
అమ్మవారి ఆధ్వర్యంలో ఉండే సైన్యం ఎప్పుడూ

గెలుస్తుంది. ఆవిడ ఒక్కొక్కళ్ళకి ఒక్కో బలాన్ని ఇచ్చి (కిరి చక్ర, గేయచక్ర లాగా), ఎలా యుద్ధం చేయాలో కూడా చెప్పేది అమ్మ తన సైన్యానికి ఎందుకంటే వాళ్ళకి వాళ్ళు తప్పకుండా గెలుస్తారని తెలుసు అమ్మకి. ఆవిడ సైన్యం సప్తకోటి ~~సైన్యాల~~ మంత్రాల సైన్యం.

దేవర్షి గణ సంఘాత స్తూయమానాత్మ వైభవా - అంటే తీం దేవతల చేత, ఋషుల చేత కీర్తింపబడేది అని సామాన్య అర్థం.

కానీ దేవతలు అంటే అచ్చులు, ఋషులు అంటే హల్లులు. అచ్చులు, హల్లుల ద్వారా మంత్రాలు రూపొందుతాయి. అలా మంత్రాలతో కీర్తింపబడేది అమ్మ అని ఈ నామంలో గూఢార్థం.

అలా మంత్రాత్మక ఉపాసనే అమ్మ యొక్క సైన్యం. సప్తకోటి మంత్రాలే అమ్మ సైన్యం.

విశల్యకరణి అనే తాయత్తుని కౌసల్యాదేవి శ్రీరాముడికి విశ్వామిత్రుడితో వెళ్తున్నప్పుడు కట్టింది. ఆ కౌసల్యాదేవి మంత్రోపాసన శక్తి ఆ తాయత్తులో ఉంది. అది ఎక్కడ ఇబ్బందిగా ఉందో నెప్పిగా ఉందో అక్కడ పెడితే ఆ బాధ వెంటనే తగ్గిపోతుంది అని శ్రీరాముడికి చెప్తూ కౌసల్యాదేవి శ్రీరాముడికి కట్టింది.

కాబట్టి పరాజయమే, విజయమే కలగాలి
అంటే అమ్మవారి ఎప్పుడూ ఈ నామంతో
ప్రార్థించాలి.

23rd May 2011

Monday

(790) నిస్త్రైగుణ్యా (నిస్, త్రైగుణ్యా).

ఎవరైతే తప్పు చేసారో వాళ్ళకి అమ్మ తప్పకుండా న్యాయదేవతగా శిక్షిస్తుంది, అయితే వాడికి బుద్ధి ఎంతో, వాడు చెడ్డ బుద్ధిలో కాకుండా మంచి బుద్ధిలో ఉండే బాగుండేది. అప్పుడు నేను వాడిని శిక్షించకుండా ఉండేదాన్ని అని బాధపడుతూ శిక్షిస్తుందట, ఎందుకంటే ఆవిడ అమ్మ కాబట్టి.

ఎంత తప్పు చేస్తే దానికి తగినంత ఫలితం ఇస్తుంది అమ్మ, ఆ తప్పుకన్నా ఎక్కువ ఫలితమూ ఇవ్వదూ అలాగే తక్కువా ఇవ్వదు.

(*) అమ్మకి నిష్పాప అనే నామం కూడా ఉంది. అంటే ఎటువంటి పాపాలనూ అమ్మ చేయదు, ఎటువంటి తప్పులూ చేయదు ఎటువంటి పాపాలనూ అనుభవించదు అని.

సహజంగా మానవులం అయిన మనకు కొన్ని ధర్మాలు మాత్రమే తెలుసు. అందుకే దేవతలు చేసిన కొన్ని పనులను చూసి అవి తప్పు అంటూ ఉంటాం.

సహజంగా శ్రీరాముడు వాలిని చెట్టు చాటు నుంచి వధించాడు, కానీ, అది తప్పు కాదు. ఎందుకంటే వాలి వానర జాతి కాబట్టి. అలాగ మానవ ధర్మాలు కొన్ని ఉంటాయి, వానరుల ధర్మాలు కొన్ని ఉంటాయి;

రాక్షస ధర్మాలలా కొన్ని ఉంటాయి. మనకి అవన్ని తెలియవు.
అందుకే మనకి కొన్ని అర్థం కావు. కాని, అమ్మకి అన్ని
తెలుసు. ఆయా జాతి ధర్మాన్ని బట్టి, వారు చేసే
తప్పుని బట్టి అమ్మ వాళ్ళకి శిక్షను విధిస్తుంది.
కాబట్టి మనం కూడా మంచి బుద్ధిని,
ఎటువంటి ఈర్ష్య, అసూయ, మరియు నిష్కామ
బుద్ధిని కోరుకుంటే అమ్మ అలా ప్రసాదించమని
ఈ నామంతో అమ్మని ప్రార్థించాలి.

24th May. 2011 Tuesday.

(491) పరాపరా.

పరా, అపరా.

పరా విద్య, అపరా విద్య, అని లోకంలో రెండు విద్యలు
ఉంటాయి. ఆ రెండు విద్యల రూపము తానే అయినది
లలితాదేవి అన్నది ఈ నామం సామాన్య అర్థం.

శునకుడు అని ఒక మహర్షి ఉండేవారు. ఆ మహర్షికి
శౌనకుడు అనే పుత్రుడు ఉండేవాడు.
శునకము అంటే వాసనా జ్ఞానం కలిగినది అని అర్థం.
వాసనా జ్ఞానం అంటే పూర్వజన్మ జ్ఞానం. ఆ శౌనకుడు
తన యొక్క గురువుగారి దగ్గరికి వెళ్ళి ఏ విషయాన్ని
తెలుసుకుంటే మొత్తం లోకమంతా తెలుసుకున్నట్లు
అవుతుందో ఆ విషయాన్ని గురించి చెప్పమన్నారు. ఆ
గురువు పరమ సంతోషించి అమ్మని గూర్చి తెలుసుకుంటే

పరాపరే అనే విషయాన్ని తెలుసుకుంటే అది సాధ్యం అని చెప్పారు. అయితే దాని గురించి చెప్పమని పరా, అపరా గురించి చెప్పమని అడిగారు. పరావిద్య ఎవ్వరికీ తెలీదు. అపరా విద్య లౌకిక జీవనం జీవించడానికి సహకరించేది.
① శిక్ష ② వ్యాకరణం ③ ఛందః ④ నిరుక్త ⑤ జ్యోతిష్యం
⑥ కల్పశ్యం. ఈ ఆరు లౌకికవి అపరావిద్య కిందలోకి వస్తాయి. ఈ అపరావిద్య లౌకిక ప్రయోజనాల కోసం నేర్చుకునేది.
శిక్ష అన్నా శీక్షా అన్నా ఒకటే. శిక్షా అంటే చదివే తీరును వివరించే శాస్త్రం పేరు శిక్షా. ఏ అక్షరం ఎలా పలకాలి, ఎలా పలికితే ఫలితం ఉంటుంది, ఇవన్నీ వివరించే శాస్త్రం శిక్షా.

25th May 2011

Wednesday

Continuation - -.

వేదాలను చదవకూడని పద్ధతులు ఆరు. ఇవి శిక్షలో ఉంటాయి

① గీతి — సంగీత సాధనాలకి అనుగుణంగా, పాటలాగా పాడకూడదు.

② శీఘ్రి — శీఘ్రం అంటే తొందర. తొందరగా ముగించకూడదు. ఎలా చదవాలో అలాగే చదవాలి.

③ తలని ఆడిస్తూ చదవకూడదు — శిరః కంపని.
అంటే తల, మెడ, శరీరం ఒకేగీతలో ఉంటే, ఆ వేదం సుస్పష్టంగా పలకబడుతుంది. అందుకని శిరః కంపనం చేయకూడదు అని అంటారు.

④ నిటారుగా కూర్చుని చదవాలి. ఎందుకంటే వెన్నుపూస
లోపల సుషుమ్నా నాడి తలవరకు చేరి ఆజ్ఞాచక్రంగా
ఉంటుంది. అలా ఆజ్ఞా చక్రంలోకి శక్తి అక్కడ నుంచి
రావాలి అని నిటారుగా కూర్చుని చదవాలి.
⑤ చూసి చదవకూడదు.
⑥ ఎదురెదురుకుండా 16 మంది బ్రాహ్మణులు
కూర్చుని చెప్పాలి వేదనాదాన్ని. కేవలం గదిలో
చదవకూడదు. అర్థం తెలియకుండా చదవకూడదు.
[అల్పకంఠుడు మరియు అశక్తుడు అని అంటారు అలాంటి
వారిద్దరినీ].

అపరా విద్యలో రెండవది వ్యాకరణం.

2. వ్యాకరణం : ఏం చదవలేకపోయినా పరవాలేదు
కానీ వ్యాకరణాన్ని బాగా చదువుకోవాలి.
వ్యక్తికి కళ్ళు ఎంత అవసరమో, వ్యాకరణం అనేది
భాషకు అంత అవసరం.

3. నిరుక్తం - ప్రపంచంలో ఉన్న ప్రతి వస్తువు ఉత్పత్తి
గురించి చెప్తుంది.

ఆసాంతం అనే ఒక పదాన్ని మనం వాడుతూ ఉంటాం.
దాని అర్థం ఏంటంటే :: ఆ - ఆజ్ఞా చక్రం.
సహా - సహస్రార చక్రం
అంతం - మొత్తం
ఆసాంతం అయిపోయింది అని అంటూ ఉంటాం.

(5) జ్యోతిషం -
జ్యోతి అంటే గ్రహాలు అని అర్థం కూడా వస్తుంది.
ఈ జ్యోతిషం ద్వారా గ్రహాలు ఎలా తిరుగుతాయి, వాటి
వల్ల మనుష్యుల ప్రభావం ఎలా ఉంటుంది, ఇవన్నీ చెప్పే
శాస్త్రం ఇది. (జాతి - జన్మించిన సమయాన్ని బట్టి విశేషాలు)

గ్రహాలన్నీ మేరు పర్వతం చుట్టూరా తిరుగుతూ
ఉంటాయి. ఏడు గ్రహాలు ఒక దిశలో తిరిగితే మిగిలిన ఏడు
గ్రహాలు ఆ మేరు దిక్కుకి ప్రతికూల దిశలో తిరుగుతాయి, [అంటే
7 - clockwise ; 7 - Anti clockwise]
(6) కల్పము. - అంటే వాస్తు శాస్త్రం. (doubt).

కాబట్టి ఇవన్నీ అపరా విద్యలోకి వస్తాయి. మనకి
ఏ విద్య అయినా అమ్మవారు అనుగ్రహిస్తేనే వస్తుంది.
ఇవన్నీ లౌకిక ప్రయోజనాల కోసం మనం అభ్యసించేవి.
కాబట్టి మనం సుఖంగా జీవించాలంటే కావలసిన విద్య
ఇది. అమ్మవారి రూపమే ఈ అపరా విద్య కూడా.
పరావిద్య, అపరావిద్య, ఇవి రెండూ అమ్మ తన
రూపంగా కలిగి ఉన్నది అని తెలుసుకుని అమ్మకి
సభక్తికంగా నమస్కరించే నామం ఇది.

30th May 2011

Monday.

(793) సామరస్య పర్యాయం.

సమరసము యొక్క భావం సామరస్య.
రస అంటే ఆనందం.
సమరస స్థితి అంటే ఇద్దరి వ్యక్తులకు ఒకటే రకమైన, ఒకటే కొలమానం అయిన ఆనంద స్థితి ఉండటం.
ఆ సమరస స్థితి లో ఉండటమే సామరస్యం.
ఉదా: భార్యాభర్తలకు ఒక శిశువు కలిగితే, ఆ భర్తకి మరియు ఆ భార్యకి ఆ శిశువు మీద ఉండే ప్రేమ ఒకటే స్థాయిది. అదే సామరస్యం.
మన పార్వతీపరమేశ్వరులు ఇద్దరూ కూడా అర్ధనారీశ్వరులు అని తెలుసు కానీ, దాని అర్థం ఏంటంటే, కనిపించేదంతా శివుడు, కనిపించకుండా చైతన్యం కలిగించేదంతా శక్తి.
అలా పైకి కనిపించేది శివుడు, లోపల చైతన్యం అమ్మ అని అర్థం.

ఒక మనిషి అనే వాడిని తీసుకుంటే, పైకి కనిపించే దేహం శివుడు, లోపల చైతన్యం అంతా అమ్మ.
అలా భార్యాభర్తలు ఇద్దరూ కూడా ఎప్పుడు సమన్వయంతో ఒకరిని ఒకరు అర్థం చేసుకుంటూ, ఒకరిని మరొకరు అదుపు చేసుకుంటూ ఉండాలి అని చెప్పే నామం ఇది.

(774) కపర్దినీ.

* కపర్దమును కలిగినది.

↳ కపర్దం అంటే చిక్కని జుట్టు ముడి. జుట్టు ఎంతటిదంటూ ప్రపంచంలో అన్ని దిక్కుల్లో

గంగని భూమి మీదకి దింపమని భగీరథుడు శివుడిని ప్రార్థించాడు. అప్పుడు గంగ పడే వేగానికి భూలోకంలో నిలవకుండా పాతాళానికి వెళ్ళిపోతుంది. అందుకని దయ ఉంచి, (భగీరథుడి తపస్సు వల్ల) శివుడు గంగను తన తలలో కపర్దం ఒక గిన్నె ఆకారంలో చేసి అందులో గంగను పట్టుమని, తను ఆ గంగ వేగాన్ని తగ్గించి అప్పుడు భూమి పైకి వదిలారు. ఈ భూమికి ఆకర్షణ శక్తి ఉంది అని మనకి మొట్టమొదట చెప్పింది గంగమ్మ. ఆ శివుడి తల మీద కపర్దంగా ఉన్నదే అమ్మవారు. ఇదే ఈ నామం యొక్క అర్థం.

June/2011 — Thursday

(796). కామధుక్.
- కోరికలను పిండగలిగిన శక్తి ఉన్నది అమ్మ అని పైనామం యొక్క అర్థం.
- కోరికలను తీర్చడంలో అమ్మ ఆవు వంటిది అని అర్థం.
- కోరికలకు అడ్డు చెప్పకుండా మనదగ్గర నుంచి అటువంటి అర్చనను అందుకునేది అమ్మ అని అర్థం.

June/2011 — Monday.

(799) కావ్యకలా.

అమ్మ ఎప్పుడైనా సరే పిల్లలు కుదురుగా అన్నం తినాలి అన్నా కుదురుగా కూర్చోవాలి అన్నా, అప్పుడు పిల్లలకు కథలు వినడం నేర్పించాలి. పూర్వం పిల్లలకు అలా కథలు చెప్పేవారు, అలా చెప్పడం ద్వారా పిల్లల యొక్క మేధాశక్తి పెరుగుతుంది, పైగా పిల్లల యొక్క మనస్తత్వం కూడా తెలుస్తుంది అమ్మకు.

అలా మనం పిల్లల్ని ~~[illegible]~~ నిర్మలమైన మనస్సు గల వారి లాగా కూడా తయ్యారు చేయచ్చు

Imp: ఈ నామం పారాయణ చేస్తే మనం మాట స్పష్టంగా, ఎదుటివారిని నొప్పించకుండా, సులభంగా ఎదుటివాళ్ళకి అర్థం అయ్యేలాగా మాట్లాడ గలుగుతాం.

అభిప్రాయాలను ప్రకటించేతీరు పిల్లలకు రావాలంటే అమ్మను ఈ నామంతో అర్చించాలి.

7th June 2011

Tuesday.

(809) రసజ్ఞ.

రసము అనే మాట అలంకార శాస్త్రం లోనిది.
దేన్నైనా ఒక చక్కని పద్ధతిలో వివరించి చెప్పే దాన్ని అలంకార శాస్త్రం అంటారు.

→ ఆ అలంకార శాస్త్రం లోని రసం యొక్క జ్ఞానం తెలిసినది అమ్మ అని పై నామం యొక్క అర్థం.

రసాలు - తొమ్మిది రకాలు. వాటినే నవరసాలు అంటారు.
శృంగారం, హాస్యం, కరుణ, క్రోధం, ఇలా తొమ్మిది ఉంటాయి.

ఈ తొమ్మిది రసాలూ అమ్మకు తెలుసు, అభినయించ గలదు అని తెలిపే నామం ఇది.

హాస్య రసానికి ఉదాహరణగా మార్కండేయుడిని తీసుకుని వెళ్దామని యముడు పాశాన్ని వేసినప్పుడు ఎడం కాల్తో శివుడు తన్నినప్పుడు, ఆ ఎడం కాలు నాదే అని అమ్మ చెప్పినప్పుడు శివుడు పకపకా నవ్వాడు. అలా వారిద్దరి

సంప్రదాయే శ్లోకా:
సాధు

~~9th June 2011~~ X

(801). [illegible] x)                                                Wednesday

10th-June-2011                                                (X)-Friday.

(Imp:-) త్రిరాత్ర ఉపవాస దీక్ష.

ఒకే పనిని మూడు రాత్రుల రోజులపాటూ చేస్తే
అది త్రిరాత్ర ఉపవాస దీక్ష.

ఎలా చేయాలి?

అన్నానికి బదులుగా పండ్లు, పాలు, తేనె, నిమ్మకాయ నీళ్ళు
లేదా గోధుమలతో చేసే ఏదైనా ఫలహారం తీసుకోవచ్చు.
మధుమేహం లాంటి వ్యాధులు ఏమైనా ఉంటే
ఉపవాసం చేయకూడదు.

ఏదైనా ఒక రోజు సంకల్పించుకుని మూడు రోజుల
పాటూ ప్రతి పూటా లలితా సహస్ర నామాలు
చదవాలి. నాలగవ రోజు ప్రొద్దున కూడా చదవాలి.
ప్రతి రోజూ ప్రతిపూటా కూడా అమ్మకు నివేదన
చేయాలి. పులిహోర (హరిద్రా అన్నం) లేదా
దధిఅన్నం (దధ్యోజనం / పెరుగన్నం) లేదా పెసరపప్పుతో
చేసిన పులగం పెట్టొచ్చు.

నాలగవ రోజు పూజ చేసి ఉదయం
(9) తొమ్మిది గంటల లోపూ సంపూర్ణ భోజనం చెయ్యాలి

అమ్మకు అన్నం రూపంలో నైవేద్యం చేస్తే, అది
కుంకుడుకాయ అంత ప్రసాదంగా స్వీకరించవచ్చు.
నాలుగవ రోజు పూజ అయ్యాక అమ్మకు
మనస్ఫూర్తిగా నమస్కరించి సత్ఫలితాన్ని ఇవ్వమని
ప్రార్థించి దీక్ష విరమించాలి.

(**) Very Important:

రహస్యం - ఋషులు చెప్పినది.

VI → లలితా సహస్రం చదివేటప్పుడు, ఆ రోజు కొన్ని
పూలు ముందే అమ్మపాదాల వద్ద పెట్టి, ఆ పువ్వులు
రెండు చేతిలో పెట్టుకుని అప్పుడు లలితా సహస్రం
చదివితే అమ్మ చాలా సంతోషిస్తుంది ఎందుకంటే
అమ్మకి పువ్వులు చాలా ఇష్టం. అలా చదివితే
ఆ లలితా సహస్ర నామాల శక్తి రెట్టింపు అవుతుంది
అంటే చేతిలో పువ్వులు పెట్టుకుని లలితాసహస్రం
చదివితే ఆ నామాల శక్తి రెట్టింపు అవుతుంది.
ఎంతమంది చదివినా, చేతిలో పువ్వులు చదివే
వాళ్ళు అందరూ పెట్టుకుంటే చాలా మంచిది.

10th june to 18th June → No prg
(L.S.N. Parayana)

18th-june-2011 Saturday.

(801) రసశేవధిః

కంఠం సరిగ్గా ఆరోగ్యంగా ఉండాలంటే బీజాక్షరాల్ని పలకాలి.

శ, → అనేది ప్రథమోష్మము.

→ రసానికి అంతటికి (అధిపతి → నిధి) ఆవిడ అని అమ్మవారి నామం యొక్క అర్థం.

→ అంటే అమ్మ నవరసాలన్నింటికి నిధి (కొ నిలయం) వంటిది అని అర్థం.

→ అమ్మ రసాలన్నింటికి సముద్రం వంటిది అని కూడా అర్థం.

అమ్మకి ఉన్న వెయ్యి నామాలు ఆవిడకి ఎదురైన సంఘటనల నుంచి రాసినవే అది కూడా అమ్మ అనుగ్రహం.

మనకి కూడా అన్ని కళలలోనూ ప్రావీణ్యం కలగాలంటే అమ్మని ఈ నామంతో అర్చించాలి.

20th june 2011 Monday.

(802) పుష్టా.

అంటే అమ్మ పుష్టిని కలిగించేది అని అర్థం.

పుష్టా అంటే పోషణ ధర్మాన్ని పాటించేది (అంటే కుటుంబ పోషణ అంతా తనే స్వీకరించింది) అని అర్థం.

అంటే జగత్తు మొత్తాన్ని నడిపించే బాధ్యతని ఆవిడ తీసుకుంది అని అర్థం.

ఉదాహరణకు ఆవిడ దోమల్ని (ఏర్పాటు) సృష్టించింది.

మళ్ళీ అవి పెరిగి పోకుండా వాటి తినడానికి కప్పల్ని సృష్టించింది.

అలా మొత్తం అన్నింటిని సృష్టించి వాటిని ఆవిడే నడిపిస్తోంది.

అలాగే బుద్ధితత్వం వాళ్ళని సృష్టించింది. అలాగే చార్వాకులను సృష్టించింది.

① బుద్ధితత్వం వాళ్ళు వేదాలు నమ్మారు. అలా వాళ్ళు ఒప్పుకోమని అంటే మిగిలిన వాళ్ళందరూ అందులో ఏముందని వాళ్ళు ఒప్పుకోవట్లేదు అని అందరూ వేదాలను చదువుతారు అని వాళ్ళని సృష్టించింది.

② చార్వాకులు కనిపించిన వాటినే నమ్ముతారు, కనపడనివి వారు నమ్మరు. ఉదాహరణకు వాళ్ళు నీళ్ళను, నేలను, అగ్నిని ఇలా కనిపించేవాటిని నమ్ముతారు. ఆకాశాన్ని నమ్మరు ఎందుకంటే ఎంత దూరం వెళ్ళినా ఆకాశం అలాగే కనిపిస్తూ ఉంటుంది. ఆకాశం అంటేనే శూన్యం. కాబట్టి అది లేదు అని వాళ్ళు నమ్మారు. అలాగే వాళ్ళని సృష్టించి, వాళ్ళ వాదనను ఖండించి తను ఉన్నానని అందరికీ తెలిసేలాగా చేసింది.

③ అద్వైతులు అని కొందరు ఉంటారు. వాళ్ళు రెండింటిని నమ్ముతారు ① జీవాలు ② అజీవాలం.

కాబట్టి వాళ్ళందరిని సృష్టింప చేసి నడిపించేది అమ్మ అని తెలుసుకొని, శాస్త్రాలన్నీ మనకి అర్థం అవ్వాలని అమ్మని ప్రార్థిస్తూ ఈ నామంతో పూజించాలి.

21st June 2011

Tuesday.

(803) పురాతనా.

- అంటే ఎంతో ప్రాచీనమైనది అమ్మ అని సామాన్య అర్థం.
ఒకసారి వశిన్యాది వాగ్దేవతలందరికీ ఒక అనుమానం
కలిగింది. అందరినీ సృష్టించింది, అన్నీ నడిపించేది
అమ్మే, మరి అలాంటి అమ్మ ఇంత యవ్వనంగా,
నవయవ్వన వతిగా ఎలా కనిపిస్తోంది అని ఆలోచన కలిగింది.
అందరి మనస్సులు తెలిసిన అమ్మకి ఈ విషయం
అర్థమయ్యింది. అప్పుడు అమ్మ వశిన్యాది వాగ్దేవతలతో
మనమందరం ఒకసారి విహారానికి వెళ్దామా అని అడిగింది.
వాళ్ళందరూ ఆనందంగా సరే అన్నారు. అమ్మ వాళ్ళందరినీ
తీసుకుని ముందు చతుర్ముఖ బ్రహ్మ గారి దగ్గరకు
వెళ్ళింది. ఆయన మామూలుగా దేవతల లెక్కల ప్రకారం
వంద సంవత్సరాలు జీవిస్తారు. వారికి 100 సం॥ల
లెక్కలో కూడా ముందొక 50 తరువాత ఒక 50
ఉంటాయి. అంటే రెండు పరార్థాలు. అందుకే మనం
మంత్రాలలో ద్వితీయ పరార్థే అంటాం. అంటే
రెండవ 50లో మొదటి సంవత్సరంలో ఉన్నాం అని
అర్థం. అలా ఆయన దగ్గరకి వెళ్ళి చూసేటప్పటికి
ఆయన అమ్మకి నమస్కరించి, సృష్టికర్త బాధ్యత
ఇచ్చినందుకు కృతజ్ఞతలు వ్యక్తం చేశారు.
ఆయన కన్నా అమ్మ చాలా చిన్నదిగా కనిపించింది
వశిన్యాది దేవతలకు. తరువాత అమ్మ వాళ్ళని
విష్ణుమూర్తి వద్దకు తీసుకెళ్ళింది. అక్కడికి వెళ్ళగానే

విష్ణుమూర్తి అమ్మకు నమస్కరించి, అమ్మ ఆధ్వర్యంలో
స్థితి ధర్మాన్ని తానే నిర్వర్తిస్తున్నానని చెప్పారు. అక్కడ
కూడా విష్ణుమూర్తి కన్నా, లక్ష్మీదేవి కన్నా అమ్మ
వశిన్యాది దేవతలకు చాలా యవ్వనంగా కనిపించింది.
తరువాత అమ్మ వాళ్ళను పరమశివుని వద్దకు
తీసుకెళ్ళింది. అక్కడికి వెళ్ళగానే అమ్మ శివుడి కన్నా
కూడా చాలా చిన్నదాని లాగా కనిపించి. ఇవన్నీ
అమ్మ వాళ్ళకు దర్శనం ఇప్పించాక, ఒకసారి వ్యాసుడు
కాశీ వచ్చినప్పుడు వారం రోజుల వరకు అతనికి భిక్ష
దొరకలేదు. అప్పుడు ఆయన కాశిని శపించాలి అనుకున్నారు.
అప్పుడు అమ్మ ఒక పెద్ద వృద్ధురాలి రూపంలో అక్కడికి
వచ్చి తన ఇంటికి వచ్చేసి భోజనం చేయమని కోరింది.
అదంతా మళ్ళీ వశిన్యాది దేవతలకు గుర్తు వచ్చేలాగా
చేసింది. ఇదంతా వశిన్యాది దేవతలకు అర్థమయ్యి, అమ్మ
కావాలనుకుంటే అతి యవ్వనంగా కనిపించగలదు అలాగే
అతి వృద్ధురాలిగా కనిపించగలదు, ఎలా కావాలనుకుంటే
అలా కనిపించగలదు కాని, అన్ని తెలిసినది, పైగా
అందరిని చూడగలిగినది, అన్నింటిని చూసింది అని
అంటే ప్రపంచాన్ని సృష్టించిన దగ్గరనుంచి ఎన్ని
యుగాలనైనా చూసి, సృష్టించి మళ్ళీ లయం చేయ-
-గలిగినది అని తెలుసుకుని, అమ్మ అతి ప్రాచీనమైనది
అని తెలుసుకుని వెంటనే లలితా నామాలలో పురాతనా
అనే నామాన్ని రాసి మనకి అందించారు. ఇది ఈ నామం
యొక్క విశేషం.

22nd june 2011 Wednesday

(804) పూజ్యా

– పూజింపబడదగిన అర్హత కలిగినది అమ్మ అని అర్థం.

ఉప: ఫలం చాలా గొప్పది. ఒకసారి రాక్షసులు సూర్యుడు ఉదయించకుండా అడ్డుగా నిల్చున్నారు. అప్పుడు మహర్షులు గాయత్రీ మంత్రం చదివి నీటిని చల్లేటప్పటికి మందేహాలు అనే రాక్షసులు వారి బలాన్ని కోల్పోయి నీరసంగా అయిపోయారు. అప్పుడు సూర్యుడు తన రథం వేసుకుని మళ్ళీ ప్రపంచమంతా తిరగసాగాడు. ఇదంతా జరిగింది అమ్మ వలనే. ఎలాగంటే వేదరూపిణి అమ్మ కాబట్టి. గాయత్రీ మంత్ర రూపం అమ్మ కాబట్టి.

• మనం బాహ్యంగా నివేదించే ప్రసాదాలకు అమ్మ వరాలు ఇవ్వరు. మనం చేసే పూజను, మనకి అమ్మ యందు ఇష్టాన్ని, మర్యాదను, భక్తిని బట్టి మనకు అనుగ్రహం దక్కుతుంది. మనం అమ్మ యందు ఎంత ప్రీతితో ఉంటామో అమ్మ కూడా మన యందు అంతే ప్రీతితో ఉంటుంది. అమ్మ పట్టుకున్న ఆయుధాల వల్ల అమ్మకు పూజనీయత రాలేదు, ఏ ఆయుధం లేకుండానే అమ్మ శక్తివంతురాలు. అగ్ని ఉండే సహజ లక్షణాలు మూడు : ① మండటం ② పట్టుకున్న వారికి మంట తెప్పించటం ③ ఇంధనం అయిపోయే వరకు మండి తరువాత ఆరిపోవటం.

అయితే హనుమంతుడి తోకకు నిప్పు అంటించినప్పుడు సీతాదేవి రూపంలో ఉన్న అమ్మ "హనుమంతుడికి పెట్టిన నిప్పు వల్ల అతనికి మంట కలగకుండా చల్లగా ఉండుగాక అని అంది". అంటే అగ్ని యొక్క లక్షణాలను కూడా మార్చగలిగే శక్తివంతురాలు అమ్మ.

కాబట్టి అమ్మని భక్తితో ఆరాధించి, మన యందు ఎటువంటి దుష్ట భావాలు చేరకుండా, ఎటువంటి దుష్ప్రభావాలూ మన మీద పడకుండా మనల్ని రక్షించమని అమ్మని ప్రార్థించాలి.

23rd June 2011 (

Thursday.

(805) పుష్కరా. (పుష్కలా) / పుష్కరా. - రెండిట్లో ఏదైనా అనుకోవచ్చు ఏం చేయడానికైనా సరే వెనకాడకుండా ఆ కార్యాన్ని సాధించగలిగే శక్తివంతురాలు అమ్మ అని ఈ నామం అర్థం.

పుష్కరం అంటే అర్థం ఏంటి అంటే మనం పాపంలో మునిగిపోతుంటే పైకి ఎత్తగలిగినది అని లేదా మనకి తగిన పుణ్య ఫలితం ఇవ్వడానికి భగవంతుడు ఇచ్చిన అవకాశం అని కూడా అనుకోవచ్చు.

కాబట్టి మనకి ఏం కావాలన్నా ఎంత కావాలన్నా ఇవ్వగలిగిన అమ్మని పుష్కలా అని అంటాం.

మనకి ఆధ్యాత్మికంలో అంటే తలలో బ్రహ్మరంధ్ర స్థానం దగ్గర 1008 రేకుల పద్మం ఉంటుంది. అలా అందులో అమ్మ ఉంటుంది. మనకి మంచి

ఆలోచనలు రావాలన్నా లేదా మన ప్రవర్తన మారాలన్నా
అన్నింటికి కూడా అమ్మ ఆజ్ఞ ముఖ్యం. అమ్మ
ఆజ్ఞ ఇవ్వగానే మనలో మంచి ఆలోచనలు కలుగుతా
యి, తద్వారా మనకి సత్ఫలితాలు వస్తాయి. కాబట్టి
మంచి ఆలోచనలు రావాలన్నా, మనం మంచి
పనులు చేయాలన్నా అన్నింటికి కారణం అమ్మ. ఎంత
మందికైనా ఎన్నైనా సరే ఇవ్వగలిగినది అమ్మ. కాబట్టి
అమ్మ ఆజ్ఞమేరకే అన్నీ జరుగుతాయి అని
తెలుసుకుంటూ, అమ్మని మనకి మంచి ఆలోచనలు
ఇవ్వమని, భగవత్ భక్తి కలిగించమని, అమ్మ
అనుగ్రహాన్ని కురిపించమని కోరుకుంటూ అమ్మని
ఈ నామంతో అర్చిస్తాం.

24th June 2011 — Friday.

(80) పద్మనయనా. – ప్రఫుల్ల, కన్నులు. పద్మం → పద్మం లాంటి చూపులు కలిగినది అది.

పద్మం లాంటి చూపు అంటే అర్థం ఏంటి అంటే
మొగ్గలాగా ఉన్న పుష్పాలు సూర్య కిరణం పడగానే
ఎలా ఆ మొగ్గ విచ్చుకుంటుందో అలాగే మనం లలితా
సహస్రం పారాయణ చేసేటప్పుడు ఎంతో భక్తితో
మనం చేయాలి. అలా చేస్తూ ఉంటే మన పారాయణ
కిరణాలు మన ఉపాసన శక్తి పెరుగుతూంటే కొద్ది కొద్దిగా
అమ్మని చేరుతాయి. అలా అమ్మని మన
ఉపాసన కిరణం తాకగానే తెరిచే కళ్లు (మనవైపు)

బిడ్డకుని మనల్ని ~~[illegible]~~ చూస్తుంది అమ్మ.
లలితా సహస్రం యొక్క పారాయణ శక్తి చాలా గొప్పది.
ఉదాహరణకు :- ఒకవేళ (మనం) భార్యాభర్తలు కలిసి
లలితా నామాలు పారాయణ చేస్తే ఆడవాళ్ళకి వాళ్ళు
పారాయణ చేసిన ఫలితమే కాకుండా భర్త యొక్క
పారాయణ ఫలితం లోంచి సగం ఫలితం కూడా
భార్యకి వెళుతుంది. (అలా 1½ శక్తి భార్యది, ½ శక్తి భర్తది)
ఓ తల్లి యొక్క కొడుకు ఒకవేళ పరీక్షకు వెళుతూంటే
అతడు వచ్చి ఆ తల్లికి నమస్కరిస్తే, ఆ తల్లి ఆ కొడుకు
తల మీద చెయ్యి పెట్టి ఆశీర్వదించి, చక్కగా రాయి
నాయనా అనగానే ఆవిడ వాక్కు ఫలించడానికి
లలితా నామ పారాయణ శక్తి సహకరించి ఆ కొడుకుకి
గుర్తురాని జవాబులు కూడా గుర్తొచ్చి చక్కగా రాసి
ఉత్తీర్ణుడు అవుతారు. అంతటి శక్తివంతమైనవి లలితా
సహస్ర నామాలు.

కాబట్టి మనం చేసే ప్రార్థనను బట్టి మనపై
అమ్మ అనుగ్రహం ఉంటుంది అని స్పష్టంగా నిరూపించే
నామం ఇది.

25th June 2011 Saturday

(807) పరంజ్యోతి: (పరంజ్యోతిషే నమః)
వెలిగింప బడిన జ్యోతి. కానీ ఏదైనా పదానికి "పరం"
అనే పదాన్ని జతచేస్తే దాని అర్థం మారిపోతుంది.
బ్రహ్మ వేరు పరంబ్రహ్మ వేరు. అలాగే,
జ్యోతి వేరు పరంజ్యోతి వేరు.

అమ్మ పరంజ్యోతి స్వరూపం. అమ్మ ఒకసారి
పరంజ్యోతిగా వెలగగానే అగ్ని అమ్మని కొన్ని
కిరణాలని, శక్తిని ఇవ్వమని కోరాడు. అప్పుడు
అగ్ని 106 (నూట ఆరు) కిరణాలను స్వీకరించాడు.
దాని వల్ల అతనికి దాహక శక్తి వచ్చింది అంటే
మండే శక్తి వచ్చింది. అది తెలుసుకున్న సూర్యుడు
వెళ్లి అమ్మని 108 (నూట ఎనిమిది) కిరణాలు
అడిగితే, అమ్మ తీసుకోమని ఇచ్చింది.
(అందుకే సూర్యచంద్రుల అగ్ని వక్షాభ్యాం అని అంటారు)
సూర్యుడు, చంద్రుడు, అగ్ని మూడు అమ్మ
శక్తి కలిగినవే. సూర్యుడు కుడి కన్ను, చంద్రుడు
ఎడమ కన్ను, అగ్ని మూడవ కన్ను.
సూర్యుడికి, అగ్నికి తేడా ఉంది.
అగ్నికి ఇంధనం వేస్తే మండుతుంది కానీ
సూర్యుడు ఏ ఇంధనం వేయకుండానే మండుతుంది.
అమ్మ మన హృదయంలోని (జ్యోతి) దైవజ్యోతిని
ప్రజ్వలింప చేయాలి అంటే ఈ నామంలో అర్థించాలి.

27th June 2011 (808)

28th June 20.. (809)

27th June 2011

Monday

(808) పరంధామః (పరంధామ్నే నమః)

పిల్లలకు నిజమైన నివాసం అమ్మ యొక్క గర్భం, కానీ, అమ్మకు మరియు పిల్లలకు అందరికీ నివాసం ఆ జగన్మాత. ఈ విషయాన్ని చెప్పే నామం ఇది.

చిన్న పిల్లల్ని ఏమైనా అంటే వాళ్ళు వెంటనే "ఉండు మా అమ్మకు చెప్తా" అని అంటారు. అంటే అమ్మకి చెప్పుకుంటే ఏ కష్టమైనా తీరుతుంది అనే సందేశాన్ని చిన్నప్పటి నుండే మన ప్రాచీనులు మనకి అలవాటు చేశారు. అలాగే మనకి ఏ కష్టం వచ్చినా అందరికీ అమ్మ అయిన లలితాదేవికి చెప్తే కష్టాలన్నీ తీరతాయి. ధామ అంటే నివాస స్థలం.

పరంధామ అంటే పవిత్రమైన నివాస స్థలం. అదే మన అందరికీ నివాస స్థలం అమ్మ అని చెప్పే నామం ఇది.

28th June 2011

Tuesday

(809) పరమాణుః (పరమాణవే నమః)

29th June 2011 Wednesday

(810) పరాత్పరా.

పరా అంటే చాలా గొప్పది అని అర్థం.
పరాత్ అంటే గొప్ప దానికన్నా చాలా గొప్పది అమ్మ అని అర్థం
అయితే అమ్మ జలరూపంలో, భూరూపంలో, ధాన్యరూపంలో
అలా అన్ని రూపాలలోనూ మనకి దర్శనం ఇచ్చి మన శరీరాన్ని,
శరీర పోషణకు, సృష్టి పోషణకు అలా అన్ని రూపాలలో
అన్ని రకాలుగా ఉండి మనల్ని పోషిస్తోంది. అందుకే పరాత్పరా
అనే నామాన్ని అమ్మకు ఇచ్చారు వశిన్యాది దేవతలు.
పృథివి, అప్, తేజో, వాయువు, ఆకాశం వీటన్నింటి కన్నా
గొప్పది పరాత్పరా (అమ్మ).
శరీరం, కన్నులు, చెవులు, నాలుక (వాక్కు), ఊపిరి (ముక్కు)
వీటన్నింటి కన్నా అమ్మ గొప్పది.

Wednesday 30th june 2011 Thursday.

(811) పాశహస్తా. - పాశాన్ని వేసేది అమ్మ అని అర్థం.
అమ్మ తన చేతిలో అనురాగం అనే పాశాన్ని పట్టుకుంటుంది. ఎవరికైనా భార్యాభర్తల మధ్య భేదాలు వస్తూంటే ఆ భార్యాభర్తలకి ఒకరి మీద ఇంకొకరికి అనురాగం పుట్టాలి అని అమ్మవారిని ప్రార్థించి ఆ అనురాగ పాశాన్ని వాళ్ళ మీద వేయమని ప్రార్థిస్తే తప్పకుండా అమ్మ, వారి మీద వేసి వారిని అనుగ్రహిస్తుంది.

అలాగే అమ్మ చేతిలో వరుణపాశం కూడా ఉంటుంది. అమ్మ యొక్క నామాలను పారాయణ చేస్తే వర్షాలు తప్పక పడతాయి.

అలాగే నాగదోషాలు ఉన్న అమ్మ యొక్క నామాలను పారాయణ చేస్తే, అంటే లలితాసహస్ర నామాలను పారాయణ చేస్తే ఆ నాగ దోషాలు పోతాయి, ఎందుకంటే అమ్మ చేతిలో నాగపాశం కూడా ఉంటుంది.

1st July 2011 Friday.

(812) పాశహంత్రీ. - పాశాలను (ఛేదించేది / తెంచివేసేది) అమ్మ అని అర్థం.
ఎనిమిది పాశాలుంటాయి ప్రతి వ్యక్తికి. అవి ఏంటంటే:
ఘృణా - దయ (జాలి), శంకా - సందేహం, శీలం - ప్రవర్తన
లజ్జా - సిగ్గు, జుగుప్సా - ,, జాతి.
భయం , కులం ,

మహిషుడు అనే అసురుడిని చంపాలన్న కర్తవ్యం
అమ్మకి అందరూ చెప్పాక అమ్మ అతడిని చంపడానికి
బయలుదేరి, వాడు కూడా తన కొడుకే అని దయతో
వాడితో మాట్లాడి ఇంక వాడివల్ల లోకమంతా
చెడిపోతుంది అని అనుకుని అప్పుడు దయ అనే
పాశాన్ని తెంచేసి అప్పుడు వాడిని వధించింది.

సిగ్గు / బిడియం అనే మాటకు అర్థం
ఆడవాళ్ళే. మనుష్యుల్లో అందరిలోకల్లా ఆడవాళ్ళకే సిగ్గు
ఎక్కువగా ఉంటుంది.

భయం అనే లక్షణం ఉన్న వాళ్ళు ఎవరైనా సరే ఈ
నామాన్ని జపిస్తే వాళ్ళకి తప్పక భయం పోతుంది
అని వ్యాఖ్యాన కర్తలు చెప్పారు.

ఈ ఎనిమిది (8) పాశాలు తొలగించేది అమ్మే.
పాశహంత్రై నమః అని ఈ నామంతో అమ్మని
పూజించాలి.

Saturday → Missed.

4th July-2011

Monday

(814) మూర్తా. - కంటికి కనిపించేది అని అర్థం.
వేప చెట్టు లక్ష్మీ స్వరూపంగా భావిస్తాం మనం. అందుకే ఆ చెట్టు ఆకులనుగాని, చెట్టుకొమ్మనుగాని గడపలకి కట్టి దాటకూడదు అని చెప్తాం. అందుకే గుమ్మాలకి ఆ ఆకులను కడతాము. అలాగే తులసి చెట్టులో కూడా మన కంటికి కనపడకుండా అమ్మ ఉంటుంది.
అట్లని ప్రతి చెట్టులో, పువ్వులో, నీటిలో అలా అన్నింటిని తన రూపంగా దాల్చి ఉంటుంది అని ఈ నామం అర్థం. ఉదాహరణ: గాలి (లేదా) వాయువు. అలాగే పంచ భూతాలన్నీ మనకి అవసరం. అవన్నీ అమ్మ రూపాలే అని ఈ నామం ద్వారా మనకి అర్థం అవుతుంది.

5th July-2011

Tuesday.

(815) అమూర్తా. - కంటికి కనిపించనిది అని అర్థం.
ఉదాహరణకు చిన్న పిల్లలు మూడవ నెలలో అలా ఉన్నప్పుడు గిలుక్కున వాడు ఏడిస్తే ఎందుకు ఏడుస్తున్నాడో తెలియక పోతే ఈ నామాన్ని ప్రార్థిస్తే మనకు వాడు ఎందుకు ఏడుస్తున్నాడో తెలుస్తుంది. ఆ కనిపించని వాడి దుఃఖంలో అమ్మ ఉంటుంది. వాడి బాధను మనకి తెలిసే లాగా అమ్మే కనపడేలాగా చేస్తుంది.
ఉదా: గాలి.

6th-july-2011

Wednesday

(816) నిత్యతృప్తా. – ఎల్లప్పుడూ తృప్తిలో ఉండేది అని అర్థం.

అమ్మకు బిల్వపత్రాలతో పూజ చేస్తే అమ్మకు చాలా ఇష్టం అని శాస్త్రాలలో ఉంది. కానీ, మనం అమ్మని మనస్ఫూర్తిగా భక్తితో ప్రార్థించి మామూలు పుష్పాలతో పూజ చేసినా అమ్మ బిల్వ పత్రాలతో పూజ చేస్తే ఎంత ఆనందిస్తుందో అంత కన్నా ఎక్కువే ఆనందిస్తుంది ఎందుకంటే ఇది మన విలువ బట్టి, మన స్తోమతను బట్టి అంతకన్నా మనకి అమ్మ మీద ఉన్న భక్తిశ్రద్ధలను బట్టి అమ్మ తృప్తి చెందుతుంది.

అలా తృప్తి పడే లక్షణం మనకి కూడా ఇవ్వమని అమ్మవారిని ఈ నామంలో ప్రార్థించాలి.

12th july-2011 Tuesday

~~(819)~~ (820) సత్యరూపా. – అమ్మ సత్యం యొక్క రూపం అని అర్థం.

13th july-2011

ప్రళయం అనాలి ప్రలయం కాదు.

లయం అంటే లయం చేసుకోవడం.

విష్ణువుకి, బ్రహ్మకి, శివుడికి ఆ ~~[illegible]~~ [illegible] చూపించింది

13th-july-2011 Wednesday

(821) సతీ - పతివ్రతా అని అర్థం.

పతివ్రతా అంటే భర్తకి ఏం కావాలో అది తెలుసుకుని చేసి భర్తను సంతోషపెట్టేది అని అర్థం.
పతివ్రత అంటే పిల్లలని తల్లి, ~~తండ్రి~~ తండ్రి అంటే ఆత్మీయత, ప్రేమ, అనురాగం, ఆప్యాయత, భయం ఉండి ఎప్పుడూ తండ్రి మాట ఎదిరించని వాళ్ళ లాగా పెంచాలి.
కష్ట కాలంలో పక్కనే ఉండేది భార్య. ఆ భార్య పతివ్రత. అందుకే తోడు-నీడ అంటారు భార్యా భర్తల్ని.

(3 missed)

18th-july-2011 Monday

(824) బహురూపా - అనేకమైన రూపాలు తనవే తాను ఉండుట అని అర్థం.
ఉదాహరణకు వృషభం, చిలుక మరియు బీజాక్షరాలు, మరియు ఎన్నో మంత్రాలు.
అంటే అమ్మని, శివుడిని, వారిరువురిని ఎదుర్కొంటుకుని వారి శక్తిని తట్టుకోగలగాలి అంటే ఆ నందీశ్వరుడికి ఎంత శక్తి ఉండాలి అనే విషయాన్ని ఆలోచించాలి అయితే అమ్మ తన శక్తిని ఆ వృషభ రూపంలో ఉంచి అలా నందీశ్వరుడిగా చేసింది. తన ఆనందం కోసం, సరదా కోసం ఎన్నో చిలుకలున్నా అమ్మ ఒక్క చిలుకనే తనపై ఎందుకు కూర్చోపెట్టుకుంది

వీటిని కూడా ఆలోచించాలి. అయితే ఆ చిలుక
కూడా అమ్మ యొక్క స్వరూపమే. ఇవే కాకుండా
అమ్మ అందరి రూపాల్లోనూ కనిపిస్తుంది. అమ్మ
బీజాక్షరాల్ని తన రూపంగా ధరించి ఉంటుంది.
అందుకే మనకి బాలామంత్రం యొక్క బీజాక్షరాలు
వేరేగా ఉంటాయి, షోడశీమంత్రం వేరేగా ఉంటుంది
అలా చాలా బీజాక్షరాలు, మంత్రాలు ఉన్నాయి.
అమ్మ కొన్ని విగ్రహ రూపాల్లో దర్శనం ఇచ్చే-
-టప్పుడు కొన్నింటిలో ఆనందంగా చిరుమందహాసంతో
కనపడుతుంది, కొన్నింటిలో చిన్న పిల్ల లాగా
కనపడుతుంది, కొన్నింటిలో చాలా ఉగ్రరూపంలో
కనపడుతుంది, కొన్నింటిలో గంభీరంగా
కనిపిస్తుంది. ఇలా ఎన్నో రూపాలలో ఉంటుంది,
మనకున్న అదృష్టాన్ని, అమ్మ యందు ప్రీతిని
బట్టి అమ్మ మనకి తన రూపాలు చూపిస్తుంది.
కాబట్టి బహురూపా అనే ఈ నామాన్ని
అర్థం చేసుకుని అమ్మని ఈ నామంతో ఆరాధించాలి.

19th july 2011 — Tuesday.

బుధార్చితా — బుధుల చేత అర్చన చేయబడునది.

(805) ~~ఆర్తి~~ - ఆర్తిని తీర్చేది అమ్మ అని అర్థం.

ఆర్తి అంటే కోరిక అని అర్థం. ఆర్తులు (4) చాలా రకాలు.
అర్థార్థి, ~~జిజ్ఞాసి~~ జిజ్ఞాసులు, జ్ఞానులు.
మనకి లోకంలో ఒక నానుడు ఉంది.

వినా వేంకటేశ ~~ననాథో~~ ననాథో ననాథః
సదా వేంకటేశ స్మరామి స్మరామి
హరే వేంకటేశ ప్రసీద ప్రసీద
ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ

ఈ శ్లోకం మన నాలుగ యుగాల గురించి చెప్తుంది.
మొదటి వాక్యం కృత యుగానికి సంబంధించింది.
రెండవ వాక్యం త్రేతా యుగాన్ని సూచిస్తుంది.
మూడవ వాక్యం ద్వాపర యుగాన్ని గూర్చి చెప్తుంది.
నాల్గవ వాక్యం ~~కలి~~ కలి యుగంలో మనుష్యుల గురించి చెప్తుంది. మొదటి వాక్యం అందరిలోనూ భగవంతుడిని, రెండవ వాక్యం ఎప్పుడూ దైవ స్మరణను, మూడవ వాక్యం కోరికలని తీర్చమని, నాల్గవ వాక్యం నాకు ప్రియమైనవి జరిపించమని కోరినట్లు అర్థం చెబుతుంది. మనం అమ్మను కేవలం కోరికలను తీర్చమని కాకుండా మంచి బుద్ధిని ప్రసాదించమని కోరుతూ మనల్ని బుధులుగా చేయమని కోరుతూ మనకి కోరికలు పుట్టకుండా ఎప్పుడూ కూడా మనం అమ్మని అర్చిస్తూనే ఉండేలాగా దీవించమని అమ్మని ఈ నామంలో అర్థించాలి.

26th july 2011 Tuesday.

(831) ప్రాణదాత్రీ - ప్రాణాన్ని ప్రసాదించేది అమ్మ అని అర్థం.
అయితే ఎప్పుడు ప్రసాదించాలో అప్పుడే ప్రసాదిస్తుంది.
ఉదాహరణకు ఒక తల్లి గర్భవతి అవగానే ఆ పిండానికి ప్రాణం
రాదు. మొదటి నెలలో కేవలం ఒక బుడగ లాగా
ఉంటుంది, రెండవ నెలలో ఒక మాంసం ముద్ద లాగా
అవుతుంది తరువాత ఆ వ్యక్తి యొక్క పూర్వ జన్మ
ఫలితాలని బట్టి వాడికి ప్రాణాన్ని ఇస్తుంది. అలా
వాడికి ప్రాణం ఇవ్వగానే వాడి జాతకం నిర్ణయింపబడు
-తుంది. కానా, మనం ఎవరైనా శిశువు భూమి
మీదకి రాగానే అప్పుడు ఆ సమయాన్ని బట్టి
జాతక చక్రం వేసుకుంటాం. అయితే మనం
వేసుకునే, మనకి తెలిసిన జాతక చక్రం అంతా
అమ్మ ప్రాణం ఇవ్వగానే వాడి యొక్క జాతకం
యొక్క ఛాయ మాత్రమే. అందుకే మనకి
జాతక చక్రం అలా వేసుకుని చూస్తే మనం
అనుకున్నవి కొన్ని జరుగుతాయి కొన్ని జరగవు.
ఇది జ్యోతిష శాస్త్రం కూడా ఒప్పుకుంటుంది.

కాబట్టి పూర్వ జన్మ కర్మ ఫలితాలను
బట్టి మనకి ప్రాణం ప్రసాదించి భూమి పైకి
పంపుతుంది అమ్మ.

ఎవరికైనా సరే ఎప్పుడైనా ప్రాణాపాయం
అనిపించినా, ప్రాణ సంకటం అని తెలిసినా మనం
అమ్మని మనస్ఫూర్తిగా ప్రార్థిస్తే తప్పకుండా ఆపద
తొలగుతుంది అని చెప్పే నామం ఇది.

Tuesday.
అని అర్థం.
...స్తుంది.
...డానికి ప్రాణం
...గ లాగా
ముద్ద లాగా
...పూర్వజన్మ
...స్తుంది. అలా
నిర్ణయింపబడు
...ల భూమి
...బట్టి
మనం
...క్రం అంతా
...జాతకం
మనకి
మనం
జరగవు.
...తాలను
...పైకి
...యం
...నా మనం
...ా అవదు

1st August 2011. Monday.

(834) వివిక్తస్థా.

వివిక్త అంటే అతి పవిత్రమైనది అని అర్థం. మన శరీరంలో వివిక్త స్థానం మూడు లేదా ఏల. అమ్మవారు అలా వివిక్తస్థా అనే ప్రదేశంలో ఉంటుంది అని ఈ నామం అర్థం. "స్థా" అంటే శాశ్వత స్థానం అని అర్థం. ఏకాంత ప్రదేశం అని అర్థం.

ఎప్పుడూ ఒకటి గుర్తుంచుకోవాలి. సామూహికంగా ఉన్నా ఏకాంత స్థితికి రాగలగాలి. ఏకాంతంలో కూడా సామూహికత్వాన్ని అవలంబించుకోగలగాలి. మనం ఏకాంత స్థితిలో ఉన్నప్పుడే అమ్మ మన దగ్గరకు రావాలి అనుకుంటు...

2nd August 2011 → Tuesday → Missed.

3rd August 2011. Wednesday

(836) వియత్ప్రసూః

- అంటే ఆకాశంలోంచి పుట్టింది అని అర్థం. అమ్మ ఎప్పుడెప్పుడు ఏ రూపాలలో పుట్టినా జ్ఞానరూపం వల్ల ఉంటుంది. పంచభూతాలన్నీ ఒకదాంట్లోంచి ఒకటి వచ్చాయి. అయితే వాటి మూలస్థానం ఆకాశం.

బ్రహ్మగారికి ముందు ఐదు తలలు ఉండేవి. ఆ ఐదు తలలలో ఒక తలను శంకరుడు తీసివేసాడు. ఆ ఐదు తలలూ పంచభూతాలకు ప్రతీకలు. శంకరుడు ఒక తలను తీసివేస్తాడు అంటే అందరి దేవతల యొక్క

అనుమతితో శంకరుడు బ్రహ్మగారి దగ్గర నుంచి ఆకాశం మీద అధికారాన్ని తీసుకున్నారు అని అర్థం.

అమ్మవారి గనక ఈ నామంతో పూజించాలి అనుకుంటే వియత్ప్రసవే నమః అని సభక్తికంగా అమ్మవారి పాదాల వద్ద పూజా పుష్పాన్ని సమర్పించాలి.

మనకి కూడా శరీరంలో తల మీద ఆకాశం ఉంటుంది. అక్కడే ఆజ్ఞాచక్రం అంటారు. అక్కడే అమ్మ ఉంటుంది. మనకి ఏదైనా సమస్య వస్తే, ఆ సమస్య లోంచి బయటపడాలి అంటే చిటుక్కున ఒక ఆలోచన కలుగుతుంది. అలా ఆలోచన కలిగింది అంటే అది అమ్మ కల్పిస్తేనే కలిగినట్టు. కాబట్టి అమ్మ మన తల అనే ఆకాశంలో ఉంటూ మనల్ని కాపాడుతూ సద్బుద్ధిని ఇస్తుంది.

4/August/2011. Thursday.

(837) ముకుందా.

– అంటే మోక్షాన్ని ప్రసాదించేది అమ్మ అని అర్థం. అమ్మ శ్రీ మహావిష్ణువు అవతారంలో ఎంతో మందిని వధించింది. వధించిన వాళ్ళకి మోక్షాన్ని ఇచ్చింది. అమ్మ లలితాదేవి రూపంలో కూడా శుంభ, నిశుంభులను వధించింది. ఎవరికీ దర్శనం ఇవ్వని అమ్మ, ఈ రాక్షసులకి దర్శనం ఇచ్చి, వాళ్ళని వధించి, వాళ్ళకి మోక్షం కూడా ఇచ్చింది. ఎందుకంటే వాళ్ళు ఒకప్పుడు ఎంతో శ్రద్ధ ఉన్న భగవత్ భక్తులు. వాళ్ళు చేసిన

దేశాల వల్ల వాళ్ళు వేరే జన్మలు ఎత్తవలసి వచ్చింది.
వాళ్ళని పునర్జన్మ ఎత్తించి తనలో కలుపుకోవడానికి అమ్మ
అవతారం దాల్చి వాళ్ళకి మోక్షాన్ని ప్రసాదించింది.
మనం కావాలంటే సమయాన్ని తెలుసుకోవడానికి
గడియారాన్ని ముందుకో, వెనక్కో తిప్పుకుంటాం, కానీ,
భగవంతుడి దగ్గర ఉన్న గడియారం ఎప్పుడూ ఆగదు,
ఎవరూ తిప్పలేరు. ఆ గడియారానికి చిన్నముల్లూ,
పెద్దముల్లూ చంద్రుడూ, సూర్యుడూ. ఆ గడియారాన్ని
నడిపేది స్వయంగా అమ్మవారే.

5th August 2011 — Friday.

General Knowledge session:

→ పంచాశత్ పీఠ రూపిణీ.

అమ్మవారు పంచాశత్ పీఠ రూపిణీ.
అమ్మవారివి 50 పీఠాలున్నాయి. అవన్నీ ఒక స్తోత్రరూపంలో
కూర్చబడి ఉన్నాయి. ఆ పీఠాల నామాలు భక్తిశ్రద్ధలతో
~~స్మ~~ స్మరించినా, ఆ పీఠాలలో అమ్మవారి దర్శనం
చేసిన ఫలితం ఇస్తుంది అమ్మ. ఆ పీఠాలు :-
"కామరూపం(1), వారణాసి(2), నేపాలం(3), (4) పురస్థిరం(5),
కన్యాకుబ్జం(6), (పూర్ణ), అమ్రాతకేశ్వరం(9), త్రిస్రోతః(11), (12)
కైలాసం(13), భృగునగరం(14), కేదారం(15), (16) శ్రీపీఠం(17),
ఓంకారపీఠం(18), (19) మాలాజేశ్వరం(20), (ఉత్తా)(21) దేవికోటం(22),
గోకర్ణం(23), (24) అట్టహాసం(25), విరజం(26), రాజగేహం(27) కొల్హాపురం(28),
మేలాపురం(30), ఓంకారం(31), జయంతికా(32), ఉజ్జయిని(33),

చిత్రకూ[34], క్షీరకం[35], హస్తినాపురం[36], ఉడ్డీశం[37], మాయాపురి[40],
జలేశ్వర[41], శ్రైలో[43], మహేంద్రో[46], వామనం[47],
హిరణ్యపురం[48], మహలక్ష్మి[49], ప్రయాగ[38], షష్ఠం[39],
మలయం[42], మేరుపృ[45], 88వరం[44], ఓడ్యాణ్యం[50],
ఛాయాఛత్రం[51],

ఏతేషాం - - - మాతృకా రూపకాస్థితాః

Saturday

6/8/2011

(838) ముక్తి నిలయా.

- మోక్షమునకు స్థానమైనది అమ్మ అని అర్థం.

ముక్తులు (ముక్తి) ఐదు రకాలు :

(Doubt) ① సార్షి / సాష్టి ముక్తి :- ఎక్కడినుంచో వచ్చి మరొ పరమాత్మ సేవను చేసి మోక్షాన్ని పొందుతారు.

(అనాహత చక్రంలో వీరు ఉంటారు) ② సామీప్య ముక్తి :- అమ్మ ఉన్న చోటే ఉంటూ, అమ్మ దర్శనం చేసుకుంటూ, అమ్మ సేవ చేసేవారు.

③ సారూప్య ముక్తి :- అమ్మ యొక్క రూపంలోనే కనిపిస్తారు కొందరు దేవతలు, అచ్చు అమ్మవారిలానే ఉంటారు. (వీరు విశుద్ధ చక్రంలో ఉంటారు).

④ సాలోక్య ముక్తి :- అమ్మ ఉండే పురంలోనే ఉంటూ సేవ చేసుకుంటూ ముక్తిని పొందుతారు.

⑤ సాయుజ్య ముక్తి :- అమ్మ పక్కనే ఉంటూ సేవ చేసుకుంటూ ముక్తిని పొందుతారు.

ఇవన్నీ ఇవ్వగలిగినది అమ్మ, అని చెప్పే నామం ఇది. మనం అమ్మ వద్దకు ఇక్కడ ఒక్క

(39) ...ం, (40) మాయాపు...
(41) ...నం,
...ప్యం (39),
...(50),

...పకాష్ఠలా:

Saturday

...ష్ఠం.

...మీరా
...రు.
ఉంటూ,
చేసేవారు.
...నే కనిపిస్తారు
...వే ఉంటారు,

...ఉంటూ

...టూ సేవ

అని చెప్పే
...క్క ఒక్క

అరుగు వేస్తే, అమ్మ మన వద్దకు వచ్చి అరు...
వేస్తుంది, మనల్ని పట్టుకోవడానికి, అనుగ్రహించడాని...

7th August 2011 → Sunday → Holiday.

8th August 2011. Monday.

(839) మూల విగ్రహ రూపిణీ.

(A) ఎక్కడైనా కలహాలు కలుగుతూ ఉంటే, ఎక్కడైనా సంసా...
విభేదాల వల్ల విడిపోతూ ఉంటే అక్కడ ఆ ఇంట్లో ఈ
నామాన్ని చాలా జాగ్రత్తగా పారాయణ చేస్తూ ఉంటే
అనుసంపుటి చేస్తూ ఉంటే, కలహాలూ విభేదాలూ
తొలగుతాయి.

దేవాలయాల్లో 5 రకాల విగ్రహాలు
ఉంటాయి. అవి :-

1. స్నపన విగ్రహం:- మూల విగ్రహం ముందు ఆ మూల
విరాట్ యొక్క ప్రతిబింబంగా ఉంటాయి, చిన్న విగ్రహాలు.
అభిషేకాలు ఏవైనా మూల విగ్రహానికి చెయ్యాలంటే
ఆ స్నపన విగ్రహాలకి చేస్తారు.

2. ఉత్సవ విగ్రహం :- నిత్యం మనం వెళ్ళి దైవ దర్శనం
చేసుకుంటూ ఉంటాం. అందుకని భగవంతుడు మ...
యందు దయతో మన వీధులలో మనందరికీ
దర్శనం ఇస్తాడు. అయితే ముందు ఆ ఉత్సవ
విగ్రహాలలో ఆ మూల విరాట్ యొక్క కళలలో
ఒక కళను ఆ ఉత్సవ విగ్రహాల లోకి ఆవాహన చేస్తా...

3, స్థాన విగ్రహం :- ఇవి అన్ని దేవాలయాలలో ఉండక పోవచ్చు. దేవాలయానికి ఎంత్తైతే ఆదాయం వస్తుందో, హుండీలో కానుకలు, ఇవన్ని లెక్క చూసి ఆ విగ్రహానికి విన్నవిస్తారు. స్వామివారు ఆ విగ్రహంరూపంలో వాటిని వింటారు, విక్షిస్తారు.

4, విమాన విగ్రహం :- మూల విరాట్ ఎలా ఉంటుందో అలాగే ఒక విగ్రహం దేవాలయం యొక్క విమానం మీద ఉంటుంది.

5, మూల విగ్రహం :- పై నున్న విగ్రహాలన్నింటిలో భగవంతుడు ఉండడు. మూల విరాట్ లో ఆయన ఉంటాడు. మూల విరాట్ లోంచి కొన్ని కళలను ఈ పై విగ్రహాలలోకి ఆవాహన చేస్తే అప్పుడు ఆ విగ్రహాలలోకి భగవంతుడు ఆహ్వానింపబడి ఆయన వాటిలోకి వస్తారు.

మనకి కూడా శరీరంలో లోపల మన ఆకాశం ఉంటుంది.
అక్కడే జ్ఞానాకాశం అంటారు. అక్కడే అమ్మ
ఉంటుంది. మనకి ఏదైనా సమస్య వస్తే, ఆ
సమస్య లోపల చూసుకోవాలి అంటే పరిష్కారం
ఒక ఆలోచన కలుగుతుంది. అలా ఆలోచన
కలిగింది అంటే అది అమ్మ కల్పిస్తేనే కలిగినట్లు.
కాబట్టి అమ్మ మన లోపల అనే ఆకాశంలో
ఉంటూ మనల్ని కాపాడుతూ స్ఫూర్తిని ఇస్తుంది.

Thursday

4/8/2011
(834) ముకుందా ...
అంటే మోక్షాన్ని ప్రసాదించేది అని అర్థం
అమ్మ శ్రీమన్ విష్ణువు అవతారంలో
ఎంతో మందిని వధించింది. వధించి వాళ్ళని
వదిలెయ్యలేదు, వాళ్ళకి మోక్షాన్ని ఇచ్చింది.
అమ్మ లలితాదేవి అవతారంలో కూడా
శుంభ నిశుంభులను వధించింది.
ఎవరికీ దర్శనం ఇవ్వని అమ్మ తన
రాక్షసులకి దర్శనం ఇచ్చి, వాళ్ళని
వధించి, వాళ్ళకి మోక్షం కూడా ఇచ్చింది
ఎందుకని అంటే వాళ్ళు ఎంతో శ్రద్ధ ఉన్న
భగవత్ భక్తులు ఏదో చిన్న పాపం వల్ల
పుట్టినప్పటికీ ఎవరైతే వాళ్ళని లోపల కలుపుకో-
-దానికి అమ్మ అవతారం దాల్చి వాళ్ళకి
మోక్షాన్ని ప్రసాదించింది. మనం కావాలంటే

సమయాన్ని తెలుసుకోవడానికి గడియారాన్ని ముందుకి వెనక్కి తిప్పుకుంటాం కాని భగవంతుడి దగ్గర ఉన్న గడియారం ఎప్పుడూ ఆగదూ ఎవరూ తిప్పలేరు. ఆ గడియారానికి చిన్నముల్లు, పెద్దముల్లు చంద్రుడూ, సూర్యుడు. ఆ గడియారాన్ని నడిపేది స్వయంగా అమ్మవారే.

5/8/2011 Friday.

→ పంచాశత్ పీఠ రూపిణీ.

కామరూపం - 1
వారణాసి - 2
నేపాలం - 3
పురస్థిరం - 5
కన్యాకుబ్జం - 6
లేదా
అమ్రాతకేశ్వరం -
త్రిస్రోతః - 11
కైలాసం - 13
భృగునగరం - 14
కేదారం - 15

శ్రీపీఠం - 17
ఓంకార పీఠం - 18
వీరాలాబిల్వరం - 20
ఛిధా -
కు
దేవికోటం - 22
గోకర్ణం - 23
అట్టహాసం - 25
విరజం - 26
రాజగేహం - 27
కోలాపురం - 29
ఏలాపురం - 30
కాలేశ్వరం - 31
జయంతిక - 32

ఉజ్జయిని - 33
చరిత్రం - 34
క్షీరకం - 35
హస్తినాపురం - 36
ఉడ్డీశం - 37
ప్రయాగ - 38
షష్ఠం - 39
మాయాపురి - 40
జలేశం - 41
మలయం - 42
శ్రీశైలం - 43
మేరువు - 44
గిరివరం - 45
మహేంద్రం - 46
వామనం - 47
హిరణ్యపురం - 48
మహాలక్ష్మి - 49
ఓడ్యాణం - 50 ; ఛాయాఛత్రం - 51
ఏకవీరా -
సమ
మహావృక్ష
రూపకోష్ఠికా:

ఇవన్నీ అమ్మవారి పీఠాలు. ఇవన్నీ స్మరిస్తే అమ్మవారి దర్శనం చేసిన ఫలితం వస్తుంది. అందుకే ఈ పీఠాలన్నీ శ్లోక రూపంలో ఒక శ్లోకం ఉంది, ఆ శ్లోకాన్ని చదువుకోవాలి.

6/8/2011
(838)
7th-Aug-20

6/8/2011

Saturday

(838) ముక్తినిలయా.

- మోక్షమునకు స్థానమైనది అమ్మ అని పై అర్థం.

ముక్తులు ఐదు రకాలు.

① సార్ష్టి/సాష్టి ముక్తి : పరమాత్మ సేవ ఎక్కడినుంచో వచ్చి మరియు చేసి మోక్షాన్ని పొందుతారు.

(అమ్మ ఉండే చక్రంలో వీరు ఉంటారు) ② సామీప్య ముక్తి : అమ్మ ఉండే చోటనే ఉంటూ, అమ్మ దర్శనం చేసుకుంటూ, అమ్మ సేవ చేసేవారు.

③ సారూప్య ముక్తి : అమ్మ యొక్క రూపంలోనే కనిపిస్తారు, అచ్చు అమ్మవారి లానే ఉంటారు (వీరు బిందు చక్రంలో ఉంటారు)

(వీరు ఆజ్ఞా చక్రంలో ఉంటారు) → ④ సాలోక్య ముక్తి : అమ్మ ఉండే పురంలోనే ఉంటూ సేవ చేసుకుంటూ ముక్తిని పొందుతారు.

⑤ సాయుజ్య ముక్తి : అమ్మ పక్కనే ఉంటూ సేవ చేసుకుంటూ ముక్తిని పొందుతారు.

వీటన్నిటి ఇవ్వగలిగినది అమ్మ అని చెప్పే నామం ఇది.

మనం అమ్మ వద్దకు ఒక్క అడుగు వేస్తే, అమ్మ మన వద్దకు పది అడుగులు వేస్తుంది, మనల్ని పట్టుకోవడానికి.

7th-Aug-2011 → Sunday

Holiday.

Monday

(839) మూల విగ్రహ రూపిణీ.

దేవాలయంలో ఐదు (5) రకాల విగ్రహాలు ఉంటాయి.

అవి :-

① స్నపన విగ్రహం :- మూల విగ్రహం ముందు ఆ మూల విరాట్ యొక్క ప్రతిబింబంగా ఉంటాయి చిన్న విగ్రహాలు. అభిషేకాలు ఏవైనా మూల విగ్రహానికి చేయాలంటే ఆ స్నపన విగ్రహాలకి చేస్తారు.

② ఉత్సవ విగ్రహం :- నిత్యం మనం వెళ్ళి దైవ దర్శనం చేసుకుంటూ ఉంటాం. అందుకని భగవంతుడు మన యందు దయతో మన వీధులలో మనందరికీ దర్శనం ఇస్తాడు. అయితే ముందు ఆ ఉత్సవ విగ్రహాలలో ఆ మూల విరాట్ యొక్క కళలలో ఒక కళను ఆ ఉత్సవ విగ్రహాలలోకి ఆవాహన చేస్తారు.

③ శ్రావణ విగ్రహం :- ఇవి అన్ని దేవాలయాలలో ఉండక పోవచ్చు. దేవాలయానికి ఎంతైతే ఆదాయం వస్తుందో, హుండీలో కానుకలు, ఇవన్నీ లెక్క చూసి ఆ విగ్రహానికి విన్నవిస్తారు. స్వామి వారు ఆ విగ్రహ రూపంలో వాటిని వింటారు, వెళ్ళిస్తారు.

④ విమాన విగ్రహం :- మూల విరాట్ ఎలా ఉంటుందో అలా ఒక విగ్రహం దేవాలయం యొక్క విమానం మీద ఉంటుంది.

⑤ మూల విగ్రహం :- పైనున్న విగ్రహాలన్నింటిలో భగవంతుడు ఉండడు. మూల విరాట్‌లో ఆయన ఉంటాడు. మూల విరాట్‌లోంచి కొన్ని కళలను ఈ పై విగ్రహాలలోకి ఆవాహన చేస్తే అప్పుడు ఆ

విగ్రహాలలోకి
వాటిలోకి

④ ఎక్కువైన క...
సంసారాల...
ఆ ఇంట్లో...
చేస్తూ ఉ...
విశేషాలా...

8/8/2011.

(840) భావజ్ఞ...
- వ...
అన్నావారు
* వ్యాదయ...
అవిత్రి...

మరియు
అది తెలి...
వెళ్ళడానికి
ఒక వేళ
అప్పుడు
అనుభవ...
పరిస్థితుల...
రావటి...
శుక్రవా...

Monday

విగ్రహాలలోకి భగవంతుడు ఆవాహింపబడి ఆయన వాటిలోకి వస్తారు.

(8) ఎక్కువైన కలహాలు కలుగుతూ ఉంటే, ఎక్కువైనా సంసారాలు విభేదాల వల్ల విడిపోతూ ఉంటే అక్కడ ఆ ఇంట్లో ఈ నామాన్ని చాలా జాగ్రత్తగా పారాయణ చేస్తూ ఉంటే, అనుసంధానం చేస్తూ ఉంటే, కలహాలు విభేదాలు తొలగుతాయి.

Tuesday

3|2011

(840) భావజ్ఞా (భావ, జ్ఞా) తెలుసుకోగలదు (or)

- హృదయంలో ఉన్న భావాన్ని అర్థంచేసుకోగలదు అమ్మవారు అని చెప్పే నామం ఇది.

* హృదయంలోకి చెడు ఆలోచనలను రాకుండా చేయమని అమ్మని ఈ నామంలో ప్రార్థిస్తారు.

మనం చేసింది మంచో, చెడో అంతా మనకి మరియు అమ్మకి తెలుస్తుంది. మనం చేసింది చెడ్డ పని అని తెలిసి చేసినా, ఇంక మనల్ని మంచి దారిలో పెట్టడానికి ఆవిడ ప్రత్యేకంగా కొరడా పట్టుకుంటుంది. ఒకవేళ మనకి ఇష్టం లేకుండా చెడ్డపని చేయాల్సి వస్తే అప్పుడు అమ్మకి దణ్ణం పెట్టుకుంటే మనం పాపం అనుభవించకుండా ఆ చెడ్డపని మంచిగా అయ్యేలాగా పరిస్థితులను తెప్పిస్తుంది.

శ్రావణ మాసంలో మంగళవారం గౌరీదేవి అవతారంలో, శుక్రవారం లక్ష్మీదేవి అవతారంలో అమ్మవారు ఉంటుంది.

→ ఆడవాళ్ళకు ఎన్ని ఉంటాయన్న వాటన్నింటికి సమాధానం
మగవాళ్ళకి ఉన్న ప్రేమ ఎటువంటి ప్రేమ.

(Varalakshmi Vratam.) — Friday

August 2011

(842) భవ చక్ర ప్రవర్తినీ.
భవ - ఇహలోకంలో
చక్రం - చక్రం యొక్క నడువడికను
ప్రవర్తినీ - నడిపే లక్షణం ఉన్నది.

ఇహలోకం చక్రం లాంటిది. ఆ చక్రాన్ని నడిపించేది
అమ్మే అని అర్థం. ఆ చక్రం మోసే బరువు మనమే.
పూర్వజన్మలో చేసుకున్న పాపం మనకి ఈ
జన్మలో వ్యాధి రూపంలో వస్తుంది.
ఆ చక్రంలో బరువులన్నీ మనం
చేసుకున్న పాపాలే. తెలియక చేసిన పాపానికి
శిక్ష తేలికగా అయిపోతుంది కాని తెలిసి చేసిన
పాపానికి శిక్ష కఠినంగా ఉంటుంది.

15th Aug 2011

(844) కాంప్రదా...
- అంటే
కలిగినది
- ...
- ...
...
ఈ ...

16th Aug 2011

(845) ...

15th Aug 2011 — Monday

(844) శాస్త్రసారా.
- అంటే శాస్త్రాల యొక్క సారాన్ని తన రూపంగా కలిగినది అమ్మ అని అర్థం.
- శాస్త్ర సమాహారమే అమ్మ.
- శాస్త్రం అంటే వ్యాకరణం, జ్యోతిషం, వేదాంతం అన్నీ వస్తాయి. శాస్త్రజ్ఞానం కోసం, ఆ జ్ఞానాన్ని పొందడానికి అమ్మని ఈ నామంతో అర్చిస్తాం.

17th Aug 2011 — Wednesday

(845) మంత్రసారా.
"మ" మననానికి సూచకం.
"త్ర" త్రాణానికి సూచకం.
అన్ని మంత్రాలకి మూల మంత్రంగా ఉన్నది అమ్మ అని అర్థం.
అయితే ఈ మంత్రాలన్ని ఎందుకు అంటే: ఎవరి నియమాలు, నిష్ఠల స్థాయిని బట్టి వారిని అమ్మ అనుగ్రహిస్తుంది.
మంత్రాలు రెండు రకాలు:
① వైదిక మంత్రం ② కామ్యసిద్ధి మంత్రాలు
→ వైదిక మంత్రాలు అంటే వేదాలలో చెప్పబడినటువంటి మంత్రాలు. ఇవి మననం చేయడం వల్ల భగవత్ కృప కలిగి, భగవంతునిలో సన్నిహిత్వం పెరిగి, మోక్షం లభిస్తుంది.
→ ఉదా: గాయత్రీ మంత్రం.

→ కామ్యక మంత్రాలు ప్రత్యేకమైన కోరికలు తీర్చడానికి మనం మననం చేసేవి. కామ్యము అంటే కోరికల సమాహారం అని అర్థం.

→ లలితా సహస్ర నామాల్లో ఉన్న వెయ్యి మంత్రాలు కోరికలు కోరి చేస్తే అవి కామ్యక మంత్రాలు అవుతాయి, అదే నామాలు కోరికలు లేకుండా, మన ధర్మం అని అనుకొని చేసే వైదిక మంత్రం అయ్యి మనల్ని భగవంతుని వద్దకు చేర్చుతుంది.

→ నేను అమ్మ యొక్క మూలమంత్రాన్ని తెలుసుకోవాలని ఆరాధించాలని అనుకుంటున్నాను ఆ అనుకుని అమ్మని స్మరించాలి అని అనుకుంటే అమ్మని ఈ నామంతో పూజించాలి.

18th-Aug-2011 Thursday

(845) మంత్రసారా (Contd).
మననం

19th-Aug-2011. Friday.

(845) మంత్రసారా (Contd).
లోకంలో కనిపించే దేవతల అందరి మంత్రముల యొక్క సారము తనదిగా కలిగినది లలితాదేవి అని అర్థం.
మంత్రాన్ని మననం ఎలా చేయాలి, విరమణ ఎలా చేయాలి అని ఈ నామం చెప్తుంది.
సోదరా అంటే అసలైన అర్థం ఏంటంటే స, ఉదర, అంటే ఇద్దరూ ఒకటే ఉదరంలోంచి బయటకి వచ్చారు అని అర్థం. అప్పుడు వాళ్ళిద్దరికి అన్నా చెల్లెల్ల సంబంధం ఉన్నట్లు.
ఒక మంత్రాన్ని మనం గ్రహించాము అంటే అందులో పూర్తి విశ్వాసం ఉంటేనే చేయాలి, లేదంటే, పూర్తి విశ్వాసం లేదంటే ఆ మంత్రం కూడా పనిచేయదు.

(V.Imp) → మంత్రోపదేశం ఎవ్వరైనా ఎవరికైనా చెప్తే ఇంక ఆ చెప్పిన వారికి మళ్ళీ వేరే వారికి చెప్పే అవకాశం లేదు. పైగా ఆ చెప్పిన వారికి ఇంకా మంత్రం పనిచేయదు.

(V.Imp) → ఎప్పుడైనా సరే మనం మనకి తెలిసిన మంత్రాన్ని వేరేవారికి చెప్తే ఇంక ఆ మంత్రం మనకి పని చేయదు.

10th-Sept-2011. Saturday.

(860) కాంతార్ధవిగ్రహా.

కాంత, అర్ధ, విగ్రహా.

↳ శివ భర్త అయిన శంకరుడి శరీరంలో సగభాగం అమ్మే అని ఈ నామం అర్థం.

అర్ధం అంటే సగం.

అర్థం అంటే ధనము లేదా ఒక పదం యొక్క వివరణ అని.

అలాంటి అర్ధనారీశ్వర రూపంలో వారిద్దరూ పై నుండి క్రింది దాకా సగం-సగం ఉంటారు. అలాంటి అర్ధనారీశ్వర రూపంలో అయ్యవారి కన్ను ఎర్రగా తీక్షణంగా ఆ ఆగ్రహంలో కనిపిస్తుంది, అమ్మవారి కన్ను అనుగ్రహాన్ని కురిపిస్తూ ఉంటుంది.

(శక్తిని) — కాంతుడి యొక్క మనస్సులో ఉన్నది గ్రహించగలిగిన శక్తిశాలి అమ్మవారు ~~[illegible]~~. మాత్రమే.

అమ్మవారి షోడశీ మంత్రం 16 అక్షరాలు అలాగే అయ్యవారి షోడశీ మంత్రం 16 అక్షరాలు. అలా వారిద్దరూ కలిసిన అర్ధనారీశ్వర రూపంలో ఉన్నప్పుడు ఇద్దరి షోడశీమంత్రాలు కలిసి 32 అక్షరాలు అవ్వాలి మళ్లీ అవి 16 అక్షరాలు అవుతాయి.

Very Imp :- అయ్యవారి యొక్క షోడశీమంత్రంలో అమ్మవారు ఇమిడి లేరు కానీ అమ్మవారి షోడశీమంత్రం అయ్యవారు (నమః శివాయ) రూపంలో ఇమిడి ఉంటారు. కాబట్టి అమ్మవారే అయ్యవారి కన్నా గొప్పది అని స్వయంగా శంకరులే ఒప్పుకున్నారు అని ఈ రహస్యాన్ని స్వయంగా బ్రహ్మశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి గారు చెప్పారు.

శంకర భగవత్ పాదుల శిష్యులు/ రూపం కల్గిన వారు.

పూర్వపు ఋషులు ఎవ్వరూ ఆడవాళ్ళని తొక్కిపెట్టలేదు.
గౌతమ మహర్షి ఎవ్వరూ అహల్యతోనే తపస్సు
చేసేవారు. అలాగే అనసూయా దేవి ఎవ్వరూ ఆవిడ
భర్తతో కూడి తపస్సుని, శైవ అర్చనని చేసేది. ఇప్పటి
కాలంలో ఇలా హెచ్చు తగ్గులు వస్తున్నాయి అప్పు
పూర్వంలో ఇలాంటి అహంకారాలు ఏమీ లేవు.
→ స్వామియుగా శంకరుడే ~~[crossed out]~~ అమ్మవారు తనకన్నా
గొప్పది అని చెప్పారు. శంకరుడు ఎంత మంచివారు,
ఎంత గొప్పవారు అయితే ఆ విషయం ఒప్పుకుంటారు.
→ ఈ రకంగా భార్యాభర్తలు ఒకరికి ఒకరు, పైగా ఇద్దరూ
ఒకటే అని అని చెప్పేదే అర్ధనారీశ్వర తత్త్వం.

11th → Sunday.

12th Sept. 2011 Monday

(861) కార్య కారణ వినిర్ముక్తా.
కార్యము, కారణము అనే రెండింటికి లొంగనిది అని అర్థం.
కార్యము కావాలి అంటే దానికి కారణం ఉండాలి. ఈ
కారణం ఉన్నా ఒక్కోసారి ~~[crossed out]~~ కార్యం అవదు,
ఒక్కోసారి కారణాలు లేకపోయినా కార్యాలు అయిపోతాయి.
అవన్నీ అమ్మ లీలలే.
ఉదాహరణకి ఒక్కోసారి ఈ ప్రమిద పెట్టి, అందులో నూనె
పోసి, అందులో వొత్తి వేసి, దీపంతో వెలిగించినా,
ఆ వొత్తులు వెలగవు. అంటే కార్యం జరగడానికి
ఎన్ని కారణాలున్నా కార్యం జరగదు. కాని ఒక్కోసారి

కారణాలు లేకుండానే కార్యాలు జరిగిపోతాయి. కాబట్టి
ఇవన్నీ అమ్మ చేతిలోనే ఉంటాయి అని చెప్పే
నామం ఇది.

13th Sept. 2011 Tuesday

(862) కామకేళీ తరంగితా. / కామకేళి తరంగితా. (రెండూ correct)
కామ - కామేశ్వరుడు అయిన శంకరుడు.
కేళి - శంకరుడు చేసిన చిలిపి చేష్టలను
తరంగితా - కెరటాలుగా కలిగినది అమ్మ అని అర్థం.
(ఉపజీవింగా) ఒకరోజు మన్మథుడు అమ్మ వద్దకు వచ్చి
"అమ్మా! నువ్వు శంకరుడికి సాలగ్రామ శ్రీ మాల
ఇవ్వకపోతే, అప్పుడు శంకరుడు నిన్ను చూసి
ఉండకపోతే అప్పుడు నేను బాణం వేయగలిగేవాడిని
కాను, అప్పుడు శంకరుడు కోపంలో నన్ను భస్మం
చేసేవారు కాదు" అని అన్నారు. ఆ మాట విన్న
అమ్మ దుఃఖించి ఆ మన్మథుడికి తన భార్య
అయిన రతీ దేవికి మాత్రమే కనిపించేలాగా వరం
ఇచ్చి, లోకంలో అందరి మీదకి బాణాలు వేసే
అధికారం కూడా ఇచ్చింది.
ఇంతలో అమ్మ వినాయకుడిని చేసి పెట్టిన
తర్వాత శంకరుడు వచ్చి ఆ తలను ఖండించి
మళ్ళీ అమ్మ దుఃఖిస్తోంది అని ఏనుగు తలను
తెచ్చి ఆ బొందానికి పెట్టి ప్రాణప్రతిష్ఠ చేసాక
అప్పుడు అమ్మ ఆనందించింది. అందుకే శంకరుడు

చేసిన చేష్టలలో అమ్మ ఆనంద తరంగాలు
పొందింది.

తరువాత వినాయకుని ఆధిపత్యం కూడా.
అయినా 'నాకు ఇంతటి శక్తులన్ని ఇవ్వమని అమ్మని
నేను అడుగలేదు, అలాగే నాకు ఏనుగు ముఖాన్ని
ఇవ్వమని నేను అడుగలేదు. ఇవన్ని ఇచ్చింది
పోల్చుకో పరిపోషిస్తున్నారా మీరే. కాని, ఇప్పుడు
ఈ శరీరం వల్ల నేను బిడియపడాను, అని
కన్నీళ్లు పెట్టుకున్నారు. అప్పుడు శంకరుడు వినాయకుడికి
నారాయణ మంత్రం ఉపదేశం చేశారు. అది
జపించి వినాయకుడు లక్ష్మీనారాయణులకు ప్రత్యక్షమై
నమస్కారం చేసి, విజయం పొందారు.

అలా మంత్రోపదేశం చేసినందుకు, అరంతా
జరిగినందుకు అమ్మ మళ్ళీ ఆనందించింది.

అలా శంకరుడు ఏం చేసినా మళ్ళీ అమ్మ
ఆనందించేలా మళ్ళీ కార్యాలను తిప్పుతారు. అలాగే
అమ్మ శంకరుడు చేసే చేష్టలకు ఆనంద కెరటాలని
తన జీవితంగా తలిచినది అమ్మ అని ఈ నామం అర్థం.

... ఆరంగాలు

...ని కూడా.
ఇష్టమైన అమ్మని
వెనుక ముడిని
...న్ని ఇస్తుంది
...కాని, ఇప్పుడు
...ము, అది
...కరుడు పాపటలో
...స్తారు, అది
...కు సత్ప్రయత్నిక
...రం.
...ందుకు, అరంటా
...పెంచుతుంది.
...ా మళ్ళీ అమ్మ
...ద్దుకోం. అలాగే
...కరండ కేశలాలని
ఈ నామ అర్థం.

25-సెప్టెం-2011

Wedne...

463) కనత్కనకతాటంకా (కనత్కనకతాటంకా).
కనత్ - బాగా ప్రకాశిస్తున్న
కనక - బంగారంతో చేయబడిన
తాటంకా - చెవి దుద్దులను ధరించినది అని అర్థం.

అంటే బాగా ప్రకాశిస్తున్న, బంగారంతో చేయబడి[న]
చెవి దుద్దులను ధరించినది అమ్మ ఆని ఈ నా[మం]
యొక్క అర్థం. శాస్త్రాలలో ఆడవాళ్ళు ఎక్కడ ఎలాంటి
ఆభరణాలు ధరించాలి అన్నది పూర్వీకులు చెప్పారు.
→ అమ్మ తన పాపిటలో ఒక పాపిట పందిరి
ధరిస్తుంది. పాపిట పందిరిని మనం ఈ కాలంలో పాపి[ట]
అంటున్నాం. ఆ పాపిట పందిరి, పాపిట అంతా సన్న
గొలుసులాగా వచ్చి, చివరన గుండ్రంగా ఒకటి
బిళ్ళలాగా లేదా పువ్వులాగా ఉంటుంది. దీనికి
వివాహ కాలంలో చాలా ప్రత్యేకత ఉంటుంది.
ఆ పాపిటని రైతు తన నాగలితో దున్నిన కాల్వలాగా
భావిస్తారు, పై నుంచి ఒక చుక్క నీరుని ఆ
పాపిట మీద పడేలాగా చేస్తారు. అంటే పై నుం[చి]
పడే నీరు వర్షంలాగా భావిస్తే, బ్రహ్మరంధ్రం
నుంచి నుదురు వరకు కారిన నీరు కాలువలో
పారిన నీరు లాగా భావించి, చక్కని ధాన్యం పం[డి]
ఆ ఇల్లు, ఆ ఊరు సస్యశ్యామలం అవుతుంది అని
శాస్త్రాలలో, మంత్రాలలో ఉంది.
→ ఆ పాపిట పందిరి వల్ల మనం జుట్టు ఊరికే
అసహ్యంగా ఊగకుండా, కదలకుండా ఉండేలాగా

సరైన పద్ధతిలో ఉండేలాగా ఆ పాపిట పండిటి
మనకి సహకరిస్తుంది, అది ఎలాగ అంటే మనం
అద్దంలో ఇలా చిక్కులా ఉంటే ఆ పాపిట పండిటి
కనిపించు ముఖానికి ఉన్న సౌందర్యాన్ని చెడగొడుతుంది
అలా జరగకుండా, పద్ధతిలో ఉండేలాగా పాపిట పండిటి
సహకరిస్తుంది.
పాపిట పండిటిని, పాపిట పంజిటి అని కూడా అంటారు.

→ పూర్వపు రోజుల్లో దాబురికి అని ఒకటి వేసేవారు.
ఆ దాబురికు ఎందుకు వేస్తారు అంటే ఒక చెవి
ముత్యం ఎక్కువ కాంతి, ఇంకో చెవి ముత్యం తక్కువ
కాంతిలో ఉంటే బాగోదు కాబట్టి ఒకే లాంటి
దాబురికు వేస్తారు. అప్పుడు రెండు చెవి ముత్యాలు
ఒకే కాంతిలో కనిపిస్తాయి.

→ అమ్మవారు ఒక చెవికి సూర్యుడికి సంబంధించిన
రాళ్ళను ముత్యాలను రెండో చెవికి చంద్రుడికి సంబంధించిన
రాళ్ళ ముత్యాలను ధరిస్తుంది. ఏమంటే ఒకటి ఎర్రగా,
ఒకటి తెల్లగా ఉంటుంది. అలా ఉంటే బాగోదు
కాబట్టి రెండు ఒక దాబురికు కూడా ఉంటుంది.
అందుకని రెండూ ఒకే రంగులో కనిపిస్తాయి.

→ సూర్యుడు పగలు మనం చేసిన పనులను అమ్మకి
చెవిలో చెప్తే, చంద్రుడు రాత్రి మనం చేసిన
పనులను అమ్మ చెవిలో చెప్తాడు. సంధ్యా
సమయంలో ప్రాతః కాలంలో మాత్రం స్థిరంగా
అమ్మ పర్యవేక్షిస్తూ ఉంటుంది.

1 month missed.

12th October. 2011 Wednesday.

(677) స్వాత్మారామా – స్వ, ఆత్మ, ఆరామా.
తనదైన ఆత్మనే ఆరామంగా చేసుకొనే లక్షణం కలది అమ్మ అని అర్థం.

→ ఎవరు తనను తెలుసుకుంటారో, ఆ వ్యక్తి యొక్క ఆత్మను ఆరామం గా అంటే తోటగా ఏర్పాటు చేసుకుని అక్కడే ఉండే లక్షణం కలది అమ్మ అని అర్థం.

→ ఎవరైతే తనను ఆరాధిస్తారో వాళ్ళని తనయందు చేర్చుకొని ~~ఆనందింప~~ ఆనందింపచేస్తుంది అని కూడా అర్థం.

→ గంగా నదికి త్రిపథగా అనే పేరు ఉంది. అంటే మూడు మార్గాలలోను యందు ప్రవహించేది అని అంటే ఆకాశగంగ, జాహ్నవి గంగా, పాతాళగంగ
↓ స్వర్గలోకంలో గంగ ↓ భూలోకంలో గంగ ↓ పాతాళంలో గంగ.

→ తీర్థయాత్రల ప్రయోజనం మనకి ఎప్పుడు లభిస్తుంది అంటే మన శరీరంలో ఉన్న పుణ్యక్షేత్రాలను దర్శించి గలిగినప్పుడే.

→ మన ఫాలభాగంలో గంగ ఉంటుంది, మన కనుబొమ్మల మధ్యస్థలంలో ప్రయాగ ఉంటుంది, మన ఫాలభాగం వద్ద జుట్టు మొదలయ్యే చోటు అర్ధంలాగా ఉంటుంది కాబట్టి అక్కడ కాశీ క్షేత్రం ఉంటుంది. (rt. side corner – kaasi).

14th Oct 2011 — Friday

(879)

సంసార సాగర (పంక) నిర్మగ్న సముద్ధరణ పండితా

కష్టాల్లోకి నెట్టేది అమ్మవారే, మళ్ళీ పైకి లాగేది అమ్మవారే అని ఈ నామం అర్థం.
సంసార పంక నిర్మగ్న, సముద్ధరణ పండితా. కానీ, అంతా ఒకటే పేరు.
శ్రీరాముడికి వనవాసం అనే కష్టాన్ని ఇప్పించింది అమ్మే, రావణాసురుడిని చంపించింది అమ్మే, మళ్ళీ వాళ్ళు అయోధ్యకు వెళ్ళేలా చేసింది అమ్మే.
అలాగే అమ్మే పాండవులను కష్టపెట్టి మళ్ళీ వాళ్ళకి అన్ని సుఖాలను ఇచ్చింది. దుష్టులని సంహరించి దానికి కురుక్షేత్రాన్ని ఇచ్చింది.

అమ్మ ఎప్పుడైనా కష్టాన్ని ఇచ్చింది అంటే, అది మన పూర్వజన్మ ఫలితాలను బట్టే. అయితే ఆ కష్టం వచ్చాక మనం మళ్ళీ అమ్మను ప్రార్థించినట్లయితే మళ్ళీ అమ్మ మనల్ని ఉద్ధరించడమే ఆ కష్టం కన్నా రెండింతల సుఖాన్ని ఇస్తుంది, పైగా తన రెండు చేతులతో మనల్ని తన గుండెకు గట్టిగా హత్తుకొని, శిక్షించినా నేనే, రక్షించినా నేనే అని ప్రేమతో అమృతమైన కరుణను మనయందు ప్రసరింపచేస్తుంది కన్నుల ద్వారా.

కాబట్టి ఎప్పుడైనా కష్టం వచ్చింది అంటే వెంటనే మనల్ని ఉద్ధరించడానికి అమ్మ ఉంది, తన కరుణని కురిపించడానికి చూస్తోంది అని అర్థంచేసుకుని అమ్మను సభక్తికంగా ప్రార్థించాలి.

-2012.

Monday.

1) శంభు మోహినీ.

శంభు - సుఖాలని కలిగించేవాడు.
సుఖాలని కలిగించేవాడికి కూడా మోహం కలిగించేది అమ్మ అని అర్థం.
మోహం అంటే అది నాకు కావాలి అనే బుద్ధి/ఇష్టం వ్యక్తం.
[సౌభాగ్య జననీ - చాలా పవిత్రమైన, చాలా విశేషమైన నామం. ఇది శ్రీహరి ఉపాసన చేసిన మంత్రం.
శ్రీహరి మోహినీ ~~[illegible]~~ రూపం కోసం అమ్మవారిని ఈ మంత్రంతో ఉపాసన చేసాడు].
మంత్రోపాసన శక్తి చాలా గొప్పది.
అమ్మ యొక్క రూపాన్ని మనలో నిక్షిప్తం చేసుకోవాలి అంటే శంభు మోహిన్యై నమః అనే నామంతో ఉపాసన చేయాలి.

28th feb.2012. Tuesday.

(956) ధరా.

ధరణి అని ధరా.
ధరించే స్వభావం ఎవరికి ఉందో ఆవిడ ధరా.

Note 1:→ ఈ ప్రపంచాన్ని అమ్మ ధరిస్తూ ఉంటుంది.

1. మొట్ట మొదటగా అమ్మ నీటిని సృష్టించి, జలాన్ని ధరించింది.
2. అందులో మట్టి మునిగిపోకుండా ఉండేలాగా నేలను / భూమిని సృష్టించి, భూమిని ధరించింది.
3. నేల కదిలిపోకుండా ఉండేలా పర్వతాలని ఏర్పాటు చేసి, ధరించింది.
4. పర్వతాల మీద వృక్షాలను సృష్టి చేసింది. వృక్షాల ఆకులలో ఔషధి గుణం ఉంటుంది. ఆకులు, పచ్చి ; పళ్ళు వచ్చాక అప్పుడు జీవ కోటిని సృష్టించింది.

అలాగే అమ్మకి శిశువు పుట్టక ముందే స్తన్యంలో పాలను ఆహారంగా ఉంచి సిద్ధం చేసాక అప్పుడు శిశువును బయటకి వచ్చే ఏర్పాటు చేస్తుంది.

Note 2:- ధరించడం అంటే ఎప్పుడైనా తీసివేయవచ్చు కూడా.

వాయువు అంటే వేగంగా పరిగెత్తే బుద్ధి కలిగినది అని అర్థం ; అంతే కాని వేగంగా పరిగెత్తే గుర్రం అని కాదు.

కాబట్టి సృష్టిని, సృష్టించిన ప్రతి దానిని అమ్మ ధరిస్తుంది అలాగే తీసేస్తుంది కూడా ప్రళయ రూపంలో.

మనిషికి ఉన్న ఆరు శత్రువులను కూడా ఆవిడ ధరిస్తుంది. అవే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు. అందరూ ఆవిడ పిల్లలే కాబట్టి అందరినీ ధరిస్తుంది, భరిస్తుంది, సమయం వచ్చినప్పుడు తీసేస్తుంది.

29th feb. 2012. Wednesday.

(957) ధరాసుతా. (ధరిసుతా కాదు)

ధరా - భూమి యొక్క

సుతా - పుత్రిక.

రావిచెట్టు ఎవరో కాదు శ్రీకృష్ణుడు. } ఇవి దేవతా
వేప చెట్టు లక్ష్మీదేవి. } వృక్షాలు.

మర్రి చెట్టు, మామిడి చెట్టు, జువ్వి చెట్టు, మేడిచెట్టు

→ ఈ ఐదు చెట్లు భూమిలోంచి పుట్టినవి. ఇవి స్వయంగా అమ్మ యొక్క స్వరూపమే.

ఇవి వృక్షాలు.

ఇప్పుడు మొక్కలు :- తులసి మొక్క భూమిలోంచి పుట్టినదే. ఇది కూడా అమ్మ యొక్క స్వరూపమే.

→ భూమిలోంచి పుట్టినవన్నీ అమ్మ స్వరూపమే, వాటిల్లో మనకి అనుకూలమైనవి మాత్రమే మనం స్వీకరించాలి

రైతు తన పంట పండాక, మొదటి పంటను
తను నమ్మిన నూకలమ్మకో, బతుకమ్మకో లేక
గ్రామ దేవతకో సమర్పించి మిగిలినది వ్యాపారం
చేసుకుంటారు ఎందుకంటే భూమిలోంచి వచ్చినది
అమ్మ ప్రసాదమే కాబట్టి.

Thursday

1st March. 2012.

(958) ధన్యా.

① ధనాన్ని ఇచ్చేది.
② ఇచ్చిన ధనాన్ని వెంపొందించేది.
③ కోరుకున్న ప్రయోజనాన్ని నెరవేర్చే లక్ష్మి.
④ యోగినులలో ఒక యోగిని. (ధన్యా అనే పేరు గల యోగిని)
⑤ భవిష్యోత్తర పురాణం అని మునులు ఒక పురాణం
రాశారు. అందులో మనుషులు ఎలా ఉంటారో
భవిష్యత్తులో అన్నీ ఉంటుంది. ① అందులో జనాలు
చాలా రకాలు ఉంటారు. అందులో ఒక రకం ఆర్తులు.
②(a) ఆర్తులు - వాళ్ళకి మంచి రాజ్యం కావాలి, చాలా
సుఖాలు కావాలు, ఆడవాళ్ళు చాలా ఉండా[లి]
(b) [illegible]. ఎన్నో భోగాలు కావాలి అనుకుంటారు.
③ ఆర్తులు → పశువులు, పక్షులుగా నైనా జన్మిస్తారు.
⑤ ధన్యా అంటే ఆర్తులను అమ్మ ఇలా పశువులుగా
లేకపోతే పక్షులుగా అయినా పుట్టిస్తుందట. వాళ్ళని
అర్భకులు అంటారు.
ఆర్తులు లౌకిక ఆనందం కోసం ఆలోచిస్తూ దైవాన్ని
విస్మరిస్తారు.

ఇంకో రకం భవిష్యోత్తర పురాణంలో
(b) రోగులు - వీళ్ళు ఎదుటి వాళ్ళని ఎప్పుడు
సమయంలో వధించి, వచ్చిన రాజ్యంలో
ఆనందించక ఇంకా కావాలని ఏడుస్తారు.
అమ్మ వీళ్ళని క్రిమికీటకాలుగా పుట్టిస్తుంది.
వీళ్ళు వాళ్ళ సుఖం కోసం ఎలాంటి పని నైనా
చేస్తారు.
(c) మూఢ ధన్యులు - వాళ్ళు దొరికిన దానిని
స్వీకరించి పరమేశ్వరి ప్రసాదంగా భావించేవారు.
(d) శుక్లులు - వీళ్ళు ప్రపంచాన్ని కలగా భావించి
మనల్ని ఈ ప్రపంచంలోకి పంపిన పని
అయిపోతే మోక్షంలోకి వెళ్ళాలని దైవధ్యానం
చేస్తూంటారు.

ఈ ధన్యులకు, శుక్లులకు మంచి
జీవనాన్ని, ఆనందాన్ని ఇచ్చి తన వద్దకు
చేర్చుకుంటుంది అమ్మ.

3rd March 2012.

Saturday

(960). ధర్మవర్ధినీ.

- ధర్మాన్ని వృద్ధిపొందించే లక్షణం ఎవరిదో, ఆ స్వభావం ఎవరిదో ఆవిడే ధర్మవర్ధినీ. వర్ధిని అనకూడదు, వర్ధినీ అనాలి.

(బుద్ధి, ఆత్మనా)

"కాయేన వాచా మనసా ఇంద్రియైర్వా బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్వభావా, కరోమి యద్యత్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి".

కాయేన(1) అమ్మ శరీరంలో ధర్మాన్ని నిలబెట్టింది. శుంభుడి సంహరించినటువంటి సందర్భం దాన్ని చూపిస్తుంది.

వాచా:- (2) అమ్మ మాటల్లో, మాట్లాడేటప్పుడు కూడా ధర్మమే చెప్తుంది, చేస్తుంది. సీతాదేవి రావణాసురుడితో మాట్లాడిన మాటలు ఈ సంగతిని రుజువు చేస్తాయి.

మనసా:- (3) మనసులో కూడా అమ్మ ఎప్పుడూ చెడు ఆలోచించదు. సహజంగా ఎవరికైనా కోపం వస్తే ఒక్క క్షణమైనా మనస్సులో వాళ్ళని శపిస్తారు, లేదా మళ్ళీ క్షమించిన వెంటనే అలా జరుగకూడదు

అని లెంపలు వేసుకుంటారు. కానీ, అమ్మ
అలా ఆలోచించదు, చెప్పదు. అంతే అమ్మ
ఒక్క క్షణం కూడా మనస్సులో కూడా
వాడికి చెడు జరగాలి అని అనుకోదు, అనదు.
కానీ ఎవరైనా చెడు చేస్తే ఎవరికైనా
ధర్మ శాస్త్రం, న్యాయ శాస్త్రం ప్రకారం ఆ
మనిషి ఖాతాలో ఆ పాపం నిక్షిప్తమైపోతుంది.

అలా అమ్మ అన్ని రకాలుగానూ
ధర్మాన్ని నిలబెడుతూనే ఉంటుంది అని ఈ
నామం యొక్క అర్థం.